లక్షనాపైల సర్క్యులేషన్‌గల
ఏకైక తెలుగు వారపత్రిక



సపరివార పత్రిక స్వాతి

ఈ వరాన్నిచ్చిన పాఠకదేవుళ్ళకు

అక్షరాలా

# లక్షరూపాయల నగదు

కానుకగా ఇవ్వదలచాం.

ఈ లక్ష రూపాయల కానుకలో సగభాగం ఏభై వేల రూపాయలు
పాఠక మహారాణులకు, మిగిలిన సగం ఏభై వేల రూపాయలు
పాఠక మహారాజులకు అందజేస్తాం.

వివరాలకు: మార్కెట్లోవున్న స్వాతి సపరివారపత్రిక చూడండి.



# చందమామ

సెప్టెంబర్ 1990



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| వార్తలు-విశేషాలు .... | 9 | శ్రీరామకృష్ణపరమహంస-4 | 37 |
| కోడలిపాట్లు .... | 11 | చదువురానివాళ్ళు .... | 41 |
| బందిపోటు యువరాజు-13 | 17 | వీరహనుమాన్-4 .... | 45 |
| భట్టలోల్లటుడి కథ (బే.క).... | 25 | అభిలాష .... | 53 |
| మతిమరుపు .... | 30 | సుల్తానా వడ్డీవ్యాపారం .... | 58 |
| చందమామ అనుబంధం-23 | 33 | ప్రకృతివింతలు .... | 63 |




విడి ప్రతి: 3-00

సంవత్సర చందా: 36-00

MAGGI CLUBBERS FUN LOVERS
MAGGI
CLUB

లాస్ అఫ్ ది జంగిల్ గేమ్

స్నేక్
సఫారి గేమ్

# మేగీ క్లబ్: రండి, అడవుల్లో సరదా విహారానికి!

# ఉచితం!

మీ బహుమతులను పొందండి

మీరు మేగీ నూడ్ల్స్ యొక్క అయిదు ఖాళీ సంచులకు ముందు వైపున ముద్రించబడి ఉండే యీ MAGGI 2-minute ను కత్తిరించి, మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం వాటిని మాకు పంపించండి. అంతే! మీకు 6 నుంచి 8 వారాలలో మేగీ క్లబ్ నుంచి ఎంతో వినోదాన్ని, ఉత్సాహాన్ని కలిగించే బహుమతి అందుతుంది!

మర్చిపోకండి:
మీరు మేగీ క్లబ్ సభ్యులు కాని పక్షంలో, మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతి పేరుతోబాటు మీ పేరు, చిరునామా పంపించండి. మీరు మేగీ క్లబ్ సభ్యులై ఉంటే, మీ సభ్యత్వపు నంబరు పంపించండి.

డిస్నీ టుడే, కామిక్

Disney TODAY

ఫారెస్ట్ ఫేసెస్ కేప్స్ మరియు మాస్క్

మా చిరునామా:
మేగీ క్లబ్ పి.ఒ. బాక్స్ 5788, న్యూ ఢిల్లీ:110055

మరొక సదుపాయం కూడా:
మీరు యింతవరకు ట్రావెల్ ఇండియా గేమ్ యింకా సేకరించి ఉండకపోతే, యిప్పుడు సేకరించండి!

జంగిల్ స్టాండీస్ సెట్

MAGGI 2-Minute noodles

HTA 6679 TEL

# RAMBO IV



No more evil, injustice and crime will be tolerated in this city. The relentless crusader is here. With his famed Zap Gun (the three sound gizmo that's the terror of the underworld) and his fleet of rough 'n tough ready-for-action vehicles — Wrecker, Super Dumper and Fire Engine. And of course, his missile-firing Helicopter. So... breathe easy. The one man army is here.

SAMMO

Mechanical and electronic toys







CHANDAMAMA TOYTRONIX

In collaboration with Sammo Corporation, S.Korea

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, 188, NSK Salai, Vadapalani, Madras 600 026

Mudra:M CTPL:4093

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## దసరా ఉత్సవాలు!

యేడాదికొకసారి దేవీపూజలు జరపడం మన దేశంలో తరతరాలుగా వస్తూన్న సంప్రదాయం. ఈ ఉత్సవాలను కొన్ని ప్రాంతాలలో దసరా అనీ, మరికొన్ని ప్రదేశాలలో దేవీనవరాత్రులనీ ఇంకా కొన్నిచోట్ల దుర్గాపూజ అనీ అంటారు. పేర్లు వేరయినప్పటికీ మన దేశమంతటా అమితోత్సాహంతో జరుపుకునే ఈ దసరా ఉత్సవాలు సెప్టెంబర్‌లో వస్తున్నాయి!

దుర్గాదేవిని మాత్రమే కాదు; మాతృదేశాన్ని, మాతృభూమినీ దైవసమానంగా గౌరవించి పూజించడం భారతీయ సంప్రదాయం! కన్నతల్లి, బిడ్డను కాపాడేవిధంగా—నేలతల్లి తన సహజసంపదలతో జీవరాశులన్నిటినీ కాపాడుతున్నది. అలాంటప్పుడు నేలతల్లిని ఉదాసీన పరచి దైవప్రేమను పొందడం అన్నది సాధ్యం కాదు.

ఈ దసరాపండుగ సందర్భంగా, మనమందరం ఒక నిర్ణయం తీసుకోవాలి. మాతృభూమినీ, నేలతల్లినీ గౌరవించి, వాటికి హానీ, కీడూ కలిగించే ఎటువంటి కార్యానికీ పూనుకోకూడదు. ప్రకృతి సంపదలైన అడవులనూ, కొండలనూ పరిరక్షించుకుంటూ, నీరూ, గాలీ కలుషితం కాకుండా కాపాడుకోవాలి. అప్పుడే మనం యేటా జరుపుకునే ఈ ఉత్సవాలూ, వేడుకలూ సార్థకాలవుతాయి!

సంపుటి 87 సెప్టెంబర్ '90 సంచిక 3
విడి ప్రతి: 3-00 :: సంవత్సర చందా: 36-00






# ఫిజీలో భారతీయుల ఇక్కట్లు




నైరుతి పసిఫిక్ మహాసముద్రంలో 1643వ సం॥లో కనుగొనబడిన 800 దీవుల సమూహాన్ని ఫిజీ అని అంటారు. 1874వ సం॥లో ఫిజీ బ్రిటిష్ వలస ప్రాంతం అయింది. 18,376 చ. కి. మీ వైశాల్యంగల ఫిజీలో ఏడున్నర లక్షల మంది నివసిస్తున్నారు. సువా దీని రాజధానీ నగరం.

19వ శతాబ్దం ఆఖరి రెండు దశాబ్దాలలో, చెరకు తోటలలో పనిచేయడానికి భారతదేశం నుంచి వేలాది మంది భారతీయులు ఫిజీ దీవులకు వలసవెళ్ళి అక్కడే స్థిరపడిపోయారు. ఆనాటి నుంచి ఫిజీ ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధికి భారతీయ సంతతి ప్రజలు ఎంతగానో పాటుపడుతున్నారు.

1970వ సం॥లో ఫిజీ స్వాతంత్ర్యం పొందింది. ఇవాళ ఫిజీ జనాభాలో భారతీయ సంతతి ప్రజలు యాభైశాతం ఉన్నారు. స్వజాతీయులయిన మెలనేషియన్లు 47 శాతం; మిగతా మూడు శాతం యురేషియన్లూ, చైనావాళ్లూ ఉన్నారు. అంటే ఫిజీలో భారతీయ సంతతివాళ్లే అధిక సంఖ్యాకులుగా ఉంటున్నారు!

ప్రజాస్వామ్య పద్ధతి ప్రకారం జరిగిన ఎన్నికలలో భారతీయ సంతతికి చెందిన డా॥ తిమోసి బవాద్ర, ఫిజీ ప్రధానమంత్రి అయ్యాడు. అయితే, సైనిక నాయకుడయిన జనరల్ సిటివేనీ రబూకా హఠాత్తుగా తిరుగుబాటు జరిపి, బవాద్ర మంత్రి మండలిని పడగొట్టాడు. ఫిజీలో స్వజాతీయులయిన మెలనేషియన్ల

అధికృతను నిలబెట్టడమే తన లక్ష్యమని చాటుకున్నాడు. ఇప్పుడు రబూకా పార్లమెంటు ఎన్నికల ద్వారా ప్రధానమంత్రి కావాలనుకుంటున్నాడు. తన పథకం సఫలం కావడానికి దేశానికి నూతన రాజ్యాంగ చట్టాన్ని రూపొందించి ప్రవేశపెట్టాడు. ఈ రాజ్యాంగ చట్టం ప్రకారం ఫిజీలో భారతీయ సంతతి ప్రజలు అధిక సంఖ్యాకులే అయినప్పటికీ ప్రభుత్వానికి నాయకత్వం వహించలేరు. రబూకా ఫిజీ నియంతకావాలని కలలు కంటున్నాడు!

ఈనాడు ప్రపంచమంతటా జాతి వివక్షతకు వ్యతిరేకంగా పోరాటాలు సాగుతున్నాయి. జాతి వివక్షతను పాటించడం అనాగరిక చర్యగా భావించబడుతున్నది. ఈ కాలఘట్టంలో, రబూకా జాతి వివక్షతకు ధూపం వేస్తూ, కొత్త జాత్యభిమానిగా తలెత్తుతున్నాడు.

దీని పర్యవసానంగా ఫిజీలోని భారతీయ సంతతి ప్రజలు నానా హింసలకు గురవుతున్నారు.

పైగా, ఫిజీ జాతీయ ఆదాయం యాత్రాస్థలాలమీదా, చెరకుపంట మీదా ఆధారపడి ఉన్నది. దేశంలోని అస్తవ్యస్త పరిస్థితుల కారణంగా రెండూ దెబ్బతిన్నాయి. రబూకా ఆశయం సిద్ధించినట్టయితే, ఫిజీలో ప్రజాస్వామ్య విలువలు మంటగలవడంతోపాటు ఆర్థిక స్థితి పతనమై, దేశం పేదరికంలోకి కూరుకుపోవడం అనివార్యమవుతుంది!






# కోడలి పాట్లు

నగరంలోని ప్రభుత్వకచ్చేరీలో ఉద్యోగం చేసే రవిచంద్రుడు, ఒక స్నేహితుడి పెళ్ళిలో స్వాతి అనే అమ్మాయిని చూశాడు. ఆమె ఒక పేద ఇంటి పిల్ల. ఆమె అందంతోపాటు, పెళ్ళిపనుల్లో ఆమె కనబరిచే నేర్పూ, కలుపుగోలుతనం అతణ్ణి బాగా ఆకర్షించాయి.

రవిచంద్రుడు, స్వాతి తల్లిదండ్రులకు తనను తాను పరిచయం చేసుకుని, "నాకు నగరంలో ఉద్యోగం. మా నాన్న ఆమధ్యనే పోయాడు. మా అమ్మకు కట్నాలపిచ్చి జాస్తి. ముందుగా తెలిస్తే, ఈ పెళ్ళికి ఆమె ఒప్పుకోదు. అందువల్ల మీ అమ్మాయికి కూడా అభ్యంతరం లేకపోతే, నేను ఈ ముహూర్తానికే ఆమెను పెళ్ళి చేసుకుంటాను. తర్వాత నెమ్మదిగా మా అమ్మకు నచ్చజెబుతాను," అన్నాడు.

స్వాతి తల్లిదండ్రులు ఇందుకు ఒప్పుకున్నారు. స్వాతి కూడా తన అంగీకారం తెలియపరిచింది. ఆ విధంగా స్నేహితుడి పెళ్ళితోపాటే రవిచంద్రుడి పెళ్ళి కూడా జరిగిపోయింది. పెళ్ళి కాగానే అతడు స్వాతిని నగరానికి తీసుకుపోయాడు.

అత్తగారు ఏం గొడవ చేస్తుందో అని హడలిపోతున్న స్వాతి, అత్త దుర్గమ్మ, రవిచంద్రుడు చెప్పినదంతా సావధానంగా విని, తనకు దిష్టితీసి, "కుడికాలు ముందు పెట్టి గడపదాటు, తల్లీ!" అనగానే హాయిగా ఊపిరి పీల్చుకున్నది.

ఆ రాత్రి భోజనాలయాక రవిచంద్రుడు, తల్లితో, "అమ్మా, కోడలు కట్నం తేలేదన్న చింత పెట్టుకోకు. స్వాతి నీకు అన్నిటా చేదోడువాదోడుగా వుంటూ, కాపురం గుట్టుగా, సుఖంగా జరిగిపోయేలా చూడగలదు," అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు




"అదాసంగతి! సరే, వాడు చేసుకుంటాననగానే చేసెయ్యడంలో, నీ నాన్న రవ్వంతబుద్ధి కనబరిచాడా? ఆ మధ్య నాకు తీర్థయాత్రల్లో పరిచయం అయిన రామాపురం రామనాథంగారు, మా అబ్బాయి అందం, ఉద్యోగం చూసి లక్ష రూపాయిల కట్నంతో తన కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. మధ్యలో నీ నాన్న శనిపీనుగలా దాపరించాడు. ఈ ఇంటి కోడలుగా, నాకు ఇష్టంలేకుండా వచ్చినందుకు నీకు తగిన శాస్తి చేస్తాను! ఈ జరిగింది నా కొడుక్కు చెప్పావంటే, ఏ నుయ్యోగొయ్యో చూసుకుని హరీ అని, అందుక్కారణం నువ్వే అని, ఉత్తరం రాసి పెట్టి మరీ పోతాను. జాగ్రత్త!" అని దుర్గమ్మ, స్వాతిని హెచ్చరించింది.

మర్నాటి ఉదయం రవిచంద్రుడు కచ్చేరికి వెళ్ళిపోగానే, దుర్గమ్మ నీళ్ళ కోసం బావికేసి పోతున్న స్వాతితో, "ఆగవే నంగనాచీ! నా కొడుక్కు ఏం మత్తుమందు పెట్టి వలలో వేసుకున్నావు? తగుదునమ్మా అని, కానీ కట్నం లేకుండా కాపురానికి రావడానికి, నీకు సిగ్గులేదూ!" అన్నది పళ్ళుకొరుకుతూ.

అత్తలో వచ్చిన మార్పుకు నిర్ఘాంత పోయిన స్వాతి, "కట్నాల సంగతులేవీ, నాకు తెలియవు. అయినా, మీ అబ్బాయే తనకు తానుగా, నా తల్లిదండ్రులతో, నేను ఇష్టపడితే పెళ్ళాడతానని చెప్పాడు," అన్నది.

ఆనాటి నుంచీ దుర్గమ్మ, కొడుకు కచ్చేరికి పోగానే పనిమనిషిని తరిమేసి, కోడలిచేత అంట్లుతోమించేది, బట్టలుతికించేది, ఇల్లంతా ఊడిపించేది.

అయితే, కొడుకు చీకటిపడేవేళ ఇల్లు చేరగానే, ఆమె తన కోడలిని ఎంతో ఆప్యాయంగా చూసుకుంటున్నదానిలా, కొడుకుతో, "ఒరే, బాబూ! స్వాతి మధ్యాన్నం పట్టెడన్నం కూడా సరిగా తిన లేదు. కోడలు చిక్కిపోతే, వచ్చే అప్రతిష్ఠ అత్తనైన నాకేగదా!" అనేది.

ఒక్కొక్కనాడు మధ్యాహ్నం వేళ దుర్గమ్మ సుష్టుగా తిని, తీరిగ్గా కూర్చుని స్వాతిని దగ్గిరకు పిలిచి, "ఒసే, ఆ రామనాథంగారి అమ్మాయిని కోడలుగా తెచ్చుకుని వుంటే, లక్ష కట్నం వెనక వేసుకుని, మహారాణిలా వుండేదాన్ని, నేను. నా కొడుకు, నీలాంటి దారేపోయే దరిద్రాన్ని తెచ్చి ఇంట్లో పెట్టాడు. అంతా నా ఖర్మ!" అంటూ తల బాదుకునేది.

ఈ విధంగా స్వాతి పాట్లు ఆరంభ మయ్యాయి.



ఒకసారి రవిచంద్రుడు కచ్చేరీ పని మీద పొరుగూరు వెళ్ళాడు. ఆ మర్నాడు స్వాతికి జ్వరం వచ్చింది. అయినా ఇదేమీ లెక్కచెయ్యకుండా దుర్గమ్మ పక్క గ్రామంలో వున్న దూరపు బంధువుల ఇంటి పెళ్ళికి పోతూ స్వాతితో, "లంకణం పరమౌషధం! నే వెళ్ళాక ఇన్నినీళ్ళు తాగి తలుపులూ, కిటికీలూ మూసేసి పడుకో. రేపు బహుశా నేను పొద్దెక్కాక తిరిగి వస్తాను. వంటా అదీ చేసి సిద్ధంగా వుంచు," అని చెప్పింది.

జ్వరంవల్ల, ఆ రాత్రి అతినీరసంగా వున్నా, స్వాతి ఓపిక తెచ్చుకుని తలుపులూ, కిటికీలూ మూసింది. అయితే అనుకోకుండా పెద్దపెట్టున వర్షం ఆరంభమై, ఆమెకు జ్వరం ఎక్కువ కావడంతో చలికి వణుకుతూ ముడుచుకుని పడుకున్నది.

అర్ధరాత్రివేళ ఎవరో తలుపు తట్టారు. స్వాతి వణుకుతూ వెళ్ళి తలుపు తెరిచింది. వర్షంలో బాగా తడిసిపోయిన ఒక అమ్మాయి, చేతిలో ఒక చిన్న పెట్టెతో లోపలికి వచ్చి, "ఇంత అర్ధరాత్రివేళ నిద్రలేపానని ఏమీ అనుకోకండి. నా పేరు విజయ. స్నేహితురాలి పెళ్ళికి వెళ్ళి, బాడుగబండిలో తిరిగి వస్తూ వర్షంలో చిక్కుకున్నాను. బండిచక్రం బురదలో కూరుకుపోయింది. మీరేమీ అనుకోక పోతే, ఈ రాత్రికి మీ ఇంట్లో వుండి, తెల్లవార గానే వెళ్ళిపోతాను," అన్నది.



స్వాతి ఆమెకు దాపులనున్న మంచం ఒకటి చూపించి, "నాకు నిన్నటినుంచీ ఒకటే జ్వరం. మీరు బాగా తడిసి పోయినట్టున్నారు. బట్టలు మార్చుకుని, ఆ మంచం మీద పడుకోండి," అన్నది.

విజయ, స్వాతి చెయ్యి పట్టుకుచూసి, "మీకు జ్వరం చాలా ఎక్కువగా వున్నట్టున్నది. మీరు పడుకోండి," అని ఆమెను మంచం దగ్గిరకు తీసుకుపోయి వదిలి, తర్వాత బట్టలు మార్చుకుని మరొక మంచం మీద పడుకున్నది.

సూర్యోదయం వేళకు స్వాతికి మెలుకువ వచ్చింది. విజయ అప్పటికే మేలుకుని పెట్టెలో బట్టలు సర్దుకుంటున్నది.

స్వాతి ఆమెతో, "ఇంకొద్దిసేపట్లో మా అత్తగారు వచ్చేస్తారు. వంట సిద్ధం చేయాలి," అంటూ మంచం దిగబోయింది.

అయితే విజయ ఆమెను పట్టుకుని, "మీరలాగే పడుకోండి. మీ పేరు తెలియక పోయినా, జ్వర తీవ్రతలో మీ కలవరింతల వల్ల, మీ ఇంటి రహస్యం నాకు తెలిసి పోయింది. కట్నం తీసుకురాని మిమ్మల్ని, మీ అత్త రాచి రంపాన పెడుతున్నది, అవునా?" అని అడిగింది.

స్వాతి, "అదేం పెద్ద రహస్యం కాదు లెండి. మా అత్తగారికి కట్నాల మీద కొండంత ఆశ. నా పెళ్ళికి ముందే ఎవరో రామాపురం రామనాథంగారు, లక్ష రూపాయిలకట్నం ఇస్తామని కబురుపంపారట! ఆయన కూతురుతో తన కొడుకు పెళ్ళి తప్పిపోయినందుకు, మా అత్తగారికి నా మీద చెప్పలేనంత కసి," అన్నది.

ఆ జవాబు వింటూనే విజయ ఒక క్షణం నివ్వెరపోయి, "అదాసంగతి! మీ అత్తగారు రాగానే, ఆవిడకు నేను మీ స్నేహితురాలినని పరిచయం చెయ్యండి. ఆమె మీద ఒక తిరుగులేని మంత్రం ప్రయోగిస్తాను," అన్నది.

అరగంట తర్వాత దుర్గమ్మ ఆపసోపాలు పడుతూ ఇంటికొచ్చింది. విలువైన పట్టుచీరా, మెడనిండుగా నగలతో

వున్న విజయ కంటబడగానే, ఆమె గతుక్కుమని, అంతలోనే తేరుకుని, "ఎవరమ్మా నువ్వు?" అని అడిగింది.

"నేను స్వాతి బాల్యస్నేహితురాల్ని. బంధువుల ఇంటి నుంచి మా ఊరు వెళుతూ, రాత్రి ఇక్కడ ఆగాను," అన్నది విజయ.

దుర్గమ్మ, విజయ మెడకేసి పరీక్షగా చూసి, అక్కడ తాలిబొట్టు లేకపోవడంతో, ఇంత డబ్బున్నపిల్ల కోడలుగా వస్తే ఎంత బావుండేది, అనుకుని, స్వాతితో, "వంట పనేదో చూడు?" అని, ఆమె వంటగది లోకి వెళ్ళిపోగానే, విజయతో, "నువ్వు మహాలక్ష్మిలా వున్నావు. నా కోడలి వాలకం చూశావుగదా? దిష్టిబొమ్మ," అన్నది.



ఆ మాటలకు విజయ నవ్వి, "రాత్రి బాగా పొద్దుపోయేవరకూ స్వాతి, నాతో మాట్లాడుతూనే వున్నది. దిష్టిబొమ్మలా వున్నా,గొప్పఅదృష్టవంతురాలు.బంగారం లాంటి అత్తగారు దొరికారు!" అన్నది.

ఆ మాటలకు పొంగిపోయిన దుర్గమ్మ, "అత్త మంచితనం గురించి చెప్పుకునే కోడళ్ళు, ఈ కాలంలో చాలా అరుదు. నన్ను గురించి స్వాతి గయ్యాళిదాన్ననే చెప్పి వుంటుంది," అన్నది.

"అదేం మాట! మీ గురించి అంతా మంచే చెప్పింది. రామాపురంలో రామ నాథంగారని, మా దూరపుబంధువొకా యన వున్నాడు. ఆయన కూతురు పెళ్ళి, ఈ మధ్యనే అయింది. దాని అత్త మహా గడుసుదిట! ఇంటి పనుల్లో దానికి ఎలాంటి సాయం చెయ్యకపోగా, నానా మాటలూ అంటుందిట. ఇక లాభం లేదని నెల కిందటే, ఆ అమ్మాయి అత్త పీడ వదిలించుకున్నది," అన్నది.

"ఏమిటేమిటీ—ఇంట్లోంచి వెళ్ళ గొట్టిందా?" అని అడిగింది దుర్గమ్మ విస్తుపోతూ.

"అలా చేసినా కొంత బావుండేది! కానీ ఏవో మందుమాకుల్తో, ఈ లోకం నుంచే సాగనంపింది," అన్నది విజయ.

''ఎంత ఘోరం! ఎంత ఘోరం! ఆ అమ్మాయి దూరపు బంధువంటున్నావా? నయం, ఒకప్పుడు లక్ష రూపాయల కట్నంతో, ఆ పిల్లను ఇంటి కోడలుగా తెచ్చుకుందామనుకున్నాను!'' అంటూ దుర్గమ్మ మంచం మీద కూర్చున్నది.

''మీరు చాలా అదృష్టవంతులు, అత్తయ్యా! వెళ్ళొస్తాను,'' అంటూ విజయ, వంటగది తలుపు దగ్గిర నిలబడి అంతా వింటున్న స్వాతికి సైగచేసి వెళ్ళి పోయింది.

ఆ క్షణంలో దుర్గమ్మకు, ఇంత కాలంగా స్వాతిని నానా ఇబ్బందులకూ గురిచేసినందుకు, ఎంతో పశ్చాత్తాపం కలిగింది.

నెల రోజుల తర్వాత ఒక మిట్ట మధ్యాహ్నంవేళ, దుర్గమ్మ పగలంతా కోడలికి ఇంటి పనుల్లో సాయంచేసి బాగా అలిసిపోయి, గుర్రుపెట్టి నిద్రపోతూండగా, ఇంటి ముందు ఒక ఎద్దుబండి వచ్చి ఆగింది. వచ్చినవాళ్ళు ఎవరా అనుకుంటూ స్వాతి బండి దగ్గిరకు వెళ్ళింది. లోపల విజయ!

''మీ అత్తలో మార్పేమయినా వచ్చిందా?'' అని అడిగింది విజయ, స్వాతిని.

''ఆమె నన్నిప్పుడు కన్నకూతురుకన్నా ఘనంగా చూసుకుంటున్నది. సరేకానీ, పాపం నువ్వా రామనాథంగారి కూతురు మీద పెద్ద అపవాదు వేశావు. తెలిస్తే ఆ అమ్మాయి ఎంత బాధపడుతుందో!'' అన్నది స్వాతి.

దానికి విజయ పెద్దగా నవ్వి, ''ఏమీ బాధపడదు. నీకు జరిగిన మేలుకు సంతోషిస్తుంది. కారణం ఏమిటో తెలుసా? ఆ అమ్మాయిని నేనే!'' అన్నది విజయ.

''ఔరా! నిజంగానా?'' అని స్వాతి ఏదో చెప్పబోతున్నంతలో, విజయ మరొక సారి నవ్వి, ''ఈ రహస్యం మీ అత్తగారికి తెలియనీయకు. నేను, మా మేనమామ గారింటికి వెళుతున్నాను. తిరిగి వచ్చేటప్పుడు ఇక్కడ దిగి, మీ ఇంట్లో ఒక వారం రోజులుంటాను,'' అన్నది.






## 13

[వసంతుడి నాయకత్వంలో తిరుగుబాటు జరిపే యువకులను కాపాడే ప్రయత్నంలో రాజు శాంతిదేవుడు బలంగా గాయపడ్డాడు. వసంతుడు, క్రూరుడైన వీరసింహుడి సేనాధిపతి కపాలకంతుణ్ణి హతమార్చాడు. అరణ్యంలో జయానందముని ఆశ్రమంలో పెరుగుతూన్న యువరాజును గురించిన వివరాలను వసంతుడికి తెలియపరిచి రాజు మరణించాడు. —తరవాత]

వసంతుడు శాంతిదేవమహారాజు తెలియజేసిన వివరాలప్రకారం వెళ్ళి, అరణ్యమధ్యంలోని జయానందముని ఆశ్రమంలో పెరుగుతూన్న యువరాజు సందీపుణ్ణి కలుసుకున్నాడు. మహారాణి సమాధి సమీపంలోనే రాజుగారి భౌతికకాయాన్ని పాతిపెట్టారు. ఆ క్షణం నుంచి వసంతుడికీ, యువరాజుకూ మధ్య గాఢమైన మైత్రి ఏర్పడింది. దానిని చూసి జయానందముని ఎంతో సంతోషించాడు. వీరసింహుడు చేసే అఘాయిత్యాలను గురించి వసంతుడి ద్వారా విని, వాటిని అరికట్టడానికి సుమేధ రాజ్య యువకులతో కలిసి తాను కూడా పాలుపంచుకుంటానవేవాడు సందీపుడు. అయినా, వసంతుడు అందుకు ఒప్పుకునేవాడు కాదు. "యువరాజా, మీ ప్రాణం మాకు అమూల్యమైనది. మీకు ఎటువంటి ఆపదా రాకూడదు.



మేమే ఆ దుర్మార్గుడి అంతు చూస్తాం,'' అనేవాడు.

యువరాజు సందీపుడు అరణ్యంలో వీరవిహారం చేసేవాడు. ఒక చెట్టు నుంచి మరొక చెట్టుకు ఉడతలా దాటేవాడు. స్వయంగా విలువిద్య నభ్యసించాడు. గురి చూసి బాణం వదలడంలో తనకు తానే సాటి అనిపించుకున్నాడు. తండ్రి లాగా ఒడ్డూపొడుగుతో ఎంతో ఆకర్షణీయంగా పెరిగి పెద్దవాడయ్యాడు.

రోజులు గడిచేకొలదీ సుమేధరాజ్యంలో శాంతి భద్రతలు కరువయ్యాయి. రైతులకూ, వ్యాపారులకూ రక్షణ లేకపోయింది. సామాన్య ప్రజల జీవితం మరీ కంటక ప్రాయమయింది. మరొకవైపు ఎంత ప్రయత్నించినప్పటికీ వీరసింహుడు తన పథకాలకు అడ్డుతగిలే యువకులను అణచలేకపోయాడు. ఆఖరికి ఒకనాడు వీరసింహుడు తన కొత్త సేనాధిపతి సర్పదంతుణ్ణి పిలిచి, ''ఆ తిరుగుబాటుదార్ల అరాచకాలను ఇక సహించి లాభం లేదు. ఈనాటితో వాళ్ళ అంతు చూడక తప్పదు. అరణ్యాలే కదా ఆ దుర్మార్గుల రహస్య స్థావరాలు! అరణ్యాలను మన సైన్యంతో గాలించి వేయాలి,'' అన్నాడు.

''చిత్తం మహాప్రభూ! సేనలను అరణ్యం కేసి నడిపిస్తాను!'' అన్నాడు సర్పదంతుడు.

''సేనలకు మేమే స్వయంగా నాయకత్వం వహించి నడిపిస్తాం,'' అన్నాడు వీరసింహుడు.

ఆ మాటలకు సర్పదంతుడు ఒక్కక్షణం ఆశ్చర్యపోయి, తరవాత తేరుకుని, ''ప్రభువులు మన్నించాలి. మరే రాజ్యం మీదికో దాడి జరిపేప్పుడు ఫరవాలేదుగాని, కేవలం అలజడి సృష్టిస్తున్న కుర్రకుంకల మీదికి ప్రభువులంతటివారు స్వయంగా వెళ్ళాలా? ఆలోచించండి,'' అన్నాడు వినయంగా.

దానికి వీరసింహుడు ఎంతో పొంగిపోయి మందహాసం చేస్తూ, ''నువ్వన్నదీ

నిజమే. అయినా మేము బహిరంగంగా యుద్ధానికి వెళుతున్నట్టు వెళ్ళం. అరణ్యానికి సరదాగా వేటకు వెళ్ళేట్టు వెళతాం. మనకంటే ముందు మన సైనికులు అడవికి వెళ్ళి అరణ్యంలోని ఒక ప్రాంతాన్ని అర్ధచంద్రాకారంలో చుట్టుముట్టి, అక్కడి జంతువులను తరుముకుని మనం ఉండేచోటికి వస్తారు. ఇలా చేయడంవల్ల అరణ్య మృగాలతోపాటు ఆ దుర్మార్గులు కూడా మననుంచి తప్పించుకోలేరుకదా? ఈ విధంగా అడవినంతా గాలించినట్టయితే, కొన్నాళ్ళకు తిరుగుబాటుదారులందర్నీ అవలీలగా ఏరిపారేయవచ్చు. ఏమంటావ్?'' అని అడిగాడు.

''బ్రహ్మాండమైన ఆలోచన ప్రభూ!'' అన్నాడు సర్పదంతుడు.

''మన ఆలోచనకు కార్యరూపం ఇవ్వడానికి తక్షణమే బయలుదేరు!'' అని ఆజ్ఞాపించాడు వీరసింహుడు.

వేటకు బయలుదేరడానికి అప్పటికప్పుడే సన్నాహాలు ప్రారంభమయ్యాయి. మర్నాడు వీరసింహుడు వందలాదిమంది సైనికులను వెంటబెట్టుకుని సర్పదంతుడితో సహా అరణ్యానికి బయలుదేరాడు. సుమేధరాజ్య సరిహద్దులో ఉన్న అరణ్యం చాలా విశాలమైనదేగాని, దురదృష్టవశాత్తు, వీరసింహుడు మొట్టమొదట



చుట్టుముట్టాలనుకున్న ప్రాంతంలోనే జయానందముని ఆశ్రమం ఉన్నది!

వీరసింహుడు అడవిని ఒక్కసారి చుట్టుపక్కల కలయజూసి, ''ఈ రోజు మేము పులులూ, ఎలుగుబంట్లూ, తోడేళ్ళూ వంటి పెద్ద పెద్ద వన్యమృగాలను చంపాలి. మీరందరూ డప్పులూ, కొమ్ముబూరలూ వాయిస్తూ వెళ్ళి, అడవిజంతువులను మా ఎదుటికి తరుముకుని రండి,'' అని సైనికులను ఆజ్ఞాపించాడు. సైనికులందరూ ఉత్సాహంగా డప్పులూ, బూరలూ వాయిస్తూ అడవిలోకి వెళ్ళారు.

జయానందముని శిష్యులు గురువు దగ్గరికి వెళ్ళి, వీరసింహుడి దాడి గురించి



తెలియజేశారు. వెంటనే జయానందముని, యువరాజును వారి కంటబడకుండా రహస్యంగా దాక్కోమన్నాడు. చిలుకతో, ''మల్లీ, నువ్వు వెళ్ళి పులీ, భల్లూకీ, ఏనుగూ మొదలైన వాటిని జాగ్రత్తపడమని హెచ్చరించు,'' అన్నాడు.

చిలుక ఎగిరి వెళ్ళిపోయింది.

అయినా, ఆలోగానే భల్లూకి అపాయంలో చిక్కుకున్నది. హఠాత్తుగా వినిపించిన కర్ణకఠోరమైన ధ్వనులకు కంగారు పడి, భల్లూకి యువరాజు కోసం చుట్టుపక్కల వెదకసాగింది. యువరాజు భద్రతను తలుచుకుని అటూ ఇటూ పరుగులు తీస్తూ తన సంగతి మరిచిపోయింది!

భల్లూకిని చూడగానే, ''బంధించండి ఆ ఎలుగుబంటును!'' అని అరిచాడు వీరసింహుడు.

పక్కనే ఉన్న వేటగాళ్ళు భల్లూకి మీదికి వలను విసిరారు. భల్లూకి వలలో పడగానే కొందరు సైనికులు దానిని చుట్టుముట్టారు. వల నుంచి బయట పడడానికి భల్లూకి ఎంతగానో ప్రయత్నించింది. కాని, ప్రయోజనం లేకపోయింది. కొందరు భటులు కొరడాలు ఝుళిపిస్తూ దానిని భయపెట్టసాగారు!

ఆ దృశ్యాన్ని చూసి వీరసింహుడు బిగ్గరగా నవ్వి, ''సెభాష్! మంచి బహుమతే దొరికింది! ఇంతకన్నా దుష్టమృగాలను పట్టుకోవాలి,'' అని పక్కనున్న సర్పదంతుడికేసి తిరిగి, సన్నటి స్వరంతో, ''దుర్మార్గులయిన తిరుగుబాటుదారులను కూడా పట్టి బంధించాలంటున్నాను,'' అన్నాడు.

''అవును ప్రభూ, తప్పకుండా పట్టి బంధించాలి!'' అంటూ ముందుకు నడవబోయాడు సర్పదంతుడు.

అయితే వాళ్ళు అక్కడినుంచి కదిలే లోగా, ''ఆగండి!'' అన్న కంఠస్వరం వినిపించింది. అందరూ తిరిగిచూశారు.

ఒకపొదచాటునుంచిముందుకువచ్చిన జయానందముని వాళ్ళను సమీపించి,



''మంచి రాజు ఒక మంచి సంప్రదాయాన్ని నిర్మూలించడు!" అన్నాడు ముని.

''ఇంతకూ నువ్వనేదేమిటి? నేను మంచి రాజు కాననేనా?'' అన్నాడు వీరసింహుడు గుడ్లురుముతూ.

''మంచిరాజువో కాదో నువ్వే నిరూపించుకోవాలి!'' అన్నాడు ముని.

''నిరూపించుకోవాలా? ఎవరి సమక్షంలో? నీ సమక్షంలోనా? నువ్వా నాకు న్యాయాధిపతివి? ఎంతపొగరు!'' అని హుంకరించాడు వీరసింహుడు.

ఇంతలో వలలో బంధించబడి వున్న భల్లూకి, అతి ప్రయత్నం మీద చేతులు వెలుపలికి తెచ్చి, పంజాతో దాపులనున్న ఒక సైనికుడి చెంపను గాయపరచింది. భటుడు కెవ్వుమని అరిచాడు.

ఆ కేక విని అటువైపు తిరిగి చూసిన వీరసింహుడు, ''ఆ దుష్ట మృగాన్ని చంపండి,'' అని అరిచాడు.

''అది దుష్టజంతువు కాదు వీరసింహా! మీరు దానిని హింసిస్తున్నారు. అది ఎదురొడ్డంటున్నది. అంతే!'' అన్నాడు ముని.

''ఏమిటీ రాజ్యాధిపతినైన నన్ను పేరు పెట్టి పిలవడానికి నీకెన్ని గుండెలు! పైగా, నేనేదో నీ సరిహద్దులో ప్రవేశించినట్టు ఇలా చెయ్, అలా చెయ్ అని నన్నే ఆజ్ఞాపిస్తున్నావు!'' అన్నాడు వీరసింహుడు.

''దయచేసి ఒక్క క్షణం నా మాటలు ఆలకించండి. సుమేధ రాజ్యాధిపతులు గాని, శాంతిపుర ప్రముఖులుగాని ఇంతకు ముందెన్నడూ ఈ ప్రాంతానికి రాలేదు. వారి కులగురువులందరూ పరంపరగా ఇక్కడే ప్రశాంత జీవనం గడపడంవల్ల దీనిని ఎంతో పవిత్రంగా భావించేవారు. ఆ సంప్రదాయాన్ని పాటించి, మీరు కూడా ఇక్కడినుంచి తిరిగివెళ్ళడం మంచిది!'' అన్నాడు.

వీరసింహుడు హేళనగా నవ్వి, ''ఆహా....ఒక రాజు ఒకసంప్రదాయాన్ని సృష్టిస్తే మరొక రాజు దానిని హాయిగా నిర్మూలించవచ్చు!'' అన్నాడు.

"నీదీ నాదీ కాదు నాయనా, ఇది ప్రకృతి సరిహద్దు!" అన్నాడు జయానందముని.

ఆ మాటలకు వీరసింహుడు పట్టరాని ఆగ్రహంతో, "ఈ ముసలివాణ్ణి పట్టి బంధించండి!" అని ఆజ్ఞాపించాడు.

కొందరు సైనికులు మునిని సమీపించి, ఆయన్ను పట్టుకున్నారు. అంతే! ఆ క్షణమే అరణ్యమే రోదించినట్టు పక్షులన్నీ రకరకాల ధ్వనులు చేశాయి.

మరు క్షణమే ఒక బాణం, పొదల చాటునుంచి దూసుకువచ్చి వీరసింహుడి పాదాలదగ్గర నేలపై గుచ్చుకున్నది. ఆ బాణానికి ఒక లేఖ ఉన్నది. వీరసింహుడు బాణాన్ని అందుకుని లేఖ తీసి చదివాడు. అందులో ఇలా ఉన్నది: "వీరసింహా, కావాలంటే ఈ బాణంతో లేఖను పంపడానికి బదులు ఈ క్షణమే నీ ప్రాణాలు తీసి ఉండవచ్చు. అయినా, అలా దొంగచాటు హీనకృత్యానికి పూనుకోవడం మా అభిమతం కాదు. ఎలుగుబంటును వదిలిపెట్టి వచ్చిన దారిపట్టి గౌరవంగా తిరిగి వెళ్లు!"

లేఖను చదివి వీరసింహుడు ఆగ్రహావేశంతో ఊగిపోయాడు. "ఈ బాణం వేసిన దుర్మార్గుణ్ణి పట్టుకోండి. వాడిక్కడే, ఈ పరిసరాల్లోనే ఏ పొదలచాటునో దాగివుంటాడు!" అని కీచుస్వరంతో అరిచాడు.



సైనికులు నాలుగు దిక్కులకూ పరుగులు తీశారు. కాని, లేఖలోని విషయం తలుచుకుని వీరసింహుడు వణికిపోయాడు. నిజంగానే బాణం తనమీదికి వస్తే తన గతి ఏం కావాలి? అన్న ఆలోచన రాగానే వీరసింహుడు భయకంపితుడై, అంగరక్షకులతో, "వచ్చినందుకు ఈ ఎలుగుబంటునూ, దాని తాతయ్యలా వున్న ఈ ముసలివాణ్ణీ తీసుకుని రాజధానికి వెళదాం. బాణం వేసిన ఆ దుర్మార్గుణ్ణి మిగతా సైనికులు వెతికి బంధించి తెస్తారు!" అంటూ ముందుకు నడిచాడు.

కాని, కొన్ని క్షణాలలో చుట్టుపక్కల నుంచి సైనికుల హాహాకారాలు వినిపిం

చాయి. సైనికులందరూ ఆర్తనాదాలు చేస్తూ చెట్టుకొకరు పుట్టకొకరుగా పరుగులు తీస్తున్నారు!

''మనం పారిపోదాం మహారాజా, అరణ్యమృగాలన్నీ కలిసి కట్టుగా ఎదురు తిరిగి మనమీదికి వస్తున్నాయి!'' అని అరిచాడు ఒక సైనికుడు.

పులుల గాండ్రింపులతో, ఏనుగుల ఘీంకారాలతో, కోతుల కిచకిచలతో, నక్కల ఊళలతో, దుమ్మలగొండ్ల నవ్వులతో—క్షణాలలో ఆ ప్రాంతమంతా అతి బీభత్సంగా మారిపోయింది. ఒక కోతి వీరసింహుడి పైకి దూకి కిరీటాన్ని ఎత్తుకుపోయింది. ఒక కాకి సర్పదంతుడి తలపాగాను తన్నుకుపోయింది.

ఈ ధ్వనులకు భయపడి చెట్టుకు కట్టబడినగుర్రాలు,పగ్గాలుతెంచుకునిఎటో పారిపోయాయి. ఇక చేసేదిలేక వీరసింహుడూ, సర్పదంతుడూ భల్లూకినీ, జయానందమునినీ అక్కడే వదిలి ప్రాణాలను గుప్పెట్లో పట్టుకుని పరుగుతీశారు.

అరణ్యమృగాలచే గాయపడి నెత్తురోడుతూన్న దేహాలతో, సైనికులు హృదయ విదారకంగా హాహాకారాలు చేస్తూ, కిందా మీదా పడుతూ పరిగెత్తసాగారు.

కొంతసేపటికి వీరసింహుడూ, అతని అనుచరులూ ఎలాగో అడవినుంచి బయట పడి, దాపులనున్న ఒక పెద్ద మైదానం చేరారు. అయినా, అడవి మృగాలు వాళ్ళను వదలకుండా తరుముతూనే ఉన్నాయి. ఒక పెద్ద పులి వీరసింహుడి మీదికి దూకడంతో, వాడు హడలిపోయి మూర్ఛపోయాడు!

''మిత్రులారా! చాలు, ఇక వెనక్కురండి!'' అన్న మధురగంభీరమైన కంఠస్వరం వినిపించడంతో, జంతువులన్నీ ఒక్కసారి వెనక్కు తిరిగి చూశాయి.

అడవికీ మైదానానికీ మధ్య ఉన్న చిన్న కొండశిఖరం మీద నిలబడి, ఒక అందమైన యువకుడు చేసిన ఆజ్ఞప్రకారం జంతువులన్నీ వెనుదిరిగి అడవిలోకి వెళ్ళసాగాయి. —(ఇంకావుంది)





# భట్టలోల్లటుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, సుందరమైన మందిరాల్లో ఎంతో విలాసంగా జీవితాన్ని గడపవలసిన నువ్వు, ఇలా భీతిగొలిపే అర్ధరాత్రివేళ శ్మశానంలో పడే ఇక్కట్లు చూస్తూంటే, స్వజాతి వాళ్ళను చంపుకున్న భట్టలోల్లటుడి వృత్తాంతం జ్ఞప్తికి వస్తున్నది. అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం వింధ్యారణ్యాల్లో, అనేకమైన ఆటవిక జాతులవాళ్లు నివసిస్తూండేవాళ్ళు. విలువిద్యా, ఖడ్గయుద్ధం, మల్లవిద్యల్లో మిగిలినవాళ్ళను ఓడించినవాడు, ఆయా జాతికి నాయకుడవుతూండేవాడు. ఒకసారి

## బేతాళ కథలు




వృద్ధనాయకుడు మరణించడంతో, భట్టలోల్లటుడనేవాడు, ఒక జాతివాళ్ళకు నాయకుడయ్యాడు. అతడికి ఆ జాతి ఆచార వ్యవహారాలపట్ల ఎంతో భక్తి, గౌరవం వుండేది. అన్ని ఆటవిక జాతులలాగే భట్ట లోల్లటుడు నాయకుడైన జాతివాళ్ళకూ కొన్ని విధినిషేధాలుండేవి. వాటిల్లో ఒకటి, కుందేలుమాంసం తినకపోవడం.

ఒకనాడు భట్టలోల్లటుడి జాతిలోని పెద్దలిద్దరు, ఒక యువకుణ్ణి బంధించి తెచ్చి, అతడి ముందు నిలబెట్టి, "వీడు మన జాతివాడే! అయినా అరణ్యంలో ఒకచోట కుందేలును కాల్చుకుతింటూ, మా కంటబడ్డాడు," అని చెప్పారు.

భట్టలోల్లటుడు, ఆ యువకుడి కేసి పరీక్షగా చూశాడు. వాడు చిక్కిశల్యంలా వున్నాడు. కళ్ళు లోతుకుపోయి వున్నవి.

భట్టలోల్లటుడు వాడిని, "కుందేలు మాంసం తినడం పాపకార్యమని, నీకు తెలియదా?" అని అడిగాడు.

అందుకు యువకుడు పీలగొంతుతో, "నేను పది రోజులక్రితం వేటకుపోయి, ప్రమాదవశాత్తూ విల్లంబులు పారేసు కున్నాను. దానికి తోడు అరణ్యంలో దారి తప్పాను. ఆకలికి ఆగలేక చివరకు కుందేలునుపట్టి తినవలసి వచ్చింది," అన్నాడు.

"కారణం ఏదైనా నువ్వు చేసింది, సహించరాని అపచారం!" అని భట్టలోల్ల టుడు పెద్దలిద్దరితో, "ఇక ముందేనాడూ ఇలాంటిది జరగకుండా, జాతివాళ్ళం దరినీ హెచ్చరించవలసి వున్నది. వీణ్ణి తీసుకుపోయి, నది అవతల ఎలుగుబంట్లు ఎక్కువగా తిరిగే అరణ్యప్రాంతాన వదిలి రండి," అన్నాడు.

భట్టలోల్లటుడి జాతివాళ్ళు నివసించే అరణ్యప్రాంతంలోని పర్వతాలకు వెనక, మరొక ఆటవికజాతివాళ్ళు ఉండేవాళ్ళు. వాళ్ళ నాయకుడు వేగుమల్లు. వాడికి భట్టలోల్లటుడి జాతివాళ్ళుండే ప్రాంతాన గలవనమూలికలూ, వేటాడిసంపాయించ

గలిగిన పులీ, ఏనుగుల చర్మాలూ, దంతాల మీద ఆశపుట్టింది.

వేగుమల్లు రహస్యంగా దాడి కవసరమైన ఏర్పాట్లన్నీ చేసుకుని, ఒకనాటి సూర్యాస్తమయవేళ హఠాత్తుగా భట్టలోల్లటుడి పైన దాడిచేశాడు. అయితే, అన్నివేళలా స్వజాతిరక్షణ విషయంలో తగు జాగ్రత్తలో వుండే భట్టలోల్లటుడు, వేగుమల్లు దాడిని ఎదుర్కొని, వాణ్ణి పూర్తిగా ఓడించి ఖైదీగా పట్టుకున్నాడు.

వేగుమల్లు చేసేదిలేక భట్టలోల్లటుడికి గోవులనూ, గొర్రెమందలనూ కానుకగా ఇచ్చి, అతడికిలొంగివుంటానని ప్రమాణం చేసి ఖైదు నుంచి విడుదలయ్యాడు.

ఈ విజయంతో ఉత్సాహవంతుడైన భట్టలోల్లటుడు, తన జాతివాళ్ళతోపాటు వేగుమల్లు జాతివాళ్ళను కూడా వెంటబెట్టుకుని, ఆ చుట్టుపక్కలగల మిగిలిన ఆటవిక జాతులన్నిటినీ లొంగదీసుకుని, అందరికీ నాయకుడయ్యాడు. ఆ తర్వాత అతడు, ఆ ప్రాంతాన్ని పాలించే వైశాలీ రాజుకు, ఏటా కానుకగా పంపే పులి చర్మాలూ, ఏనుగుదంతాలూ, వనసంపదా పంపడం మానివేశాడు.

ఇది చూసి ఆగ్రహించిన వైశాలీరాజు సైన్యంతో, భట్టలోల్లటుడుండే అరణ్య ప్రాంతాల మీదికి దాడి బయలుదేరాడు.



సంఖ్యలో వైశాలీ రాజు సైనిక బలం ఎక్కువేగాని, వాళ్ళకు ఆటవికుల యుద్ధ వ్యూహం తెలియదు. చెట్లచాటునుంచీ, గుట్టల వెనుకనుంచీ, భట్టలోల్లటుడి ఆటవికులు ఈటెలనూ, విషం పూసిన బాణాలనూ సైనికుల మీద ప్రయోగించారు. చచ్చినవాళ్ళు చావగా మిగిలిన సైనికులు చెల్లాచెదురుగా పారిపోయారు. ద్వంద్వ యుద్ధంలో భట్టలోల్లటుడు, వైశాలీరాజును చంపి, తానే వైశాలీరాజయ్యాడు.

అతడు రాజ్యంలోని ఇతర పౌరులలాగే, ఆటవికులకు కూడా సమాన హక్కులు ప్రకటించి, వాళ్ళ అభివృద్ధికి ఎన్నో పరిశ్రమలు ఏర్పాటు చేశాడు.



వీరులైన ఆటవికులకు సైన్యంలో కొన్ని ఉన్నతపదవులిచ్చాడు. ఆస్థానంలో నాగరికులతోపాటు, ఆటవిక ప్రముఖులకు స్థానం లభించింది.

ఒకనాడు భట్టలోల్లటుడు కొలువులో వుండగా, అతడి జాతికి చెందిన పెద్దలు కొందరు, ఒక నాగరిక యువకుణ్ణి బంధించి తెచ్చి, "రాజా, మన సంప్రదాయాలూ, ఆచారాలూ మీకు తెలియనివికావు! వాటిని కాపాడడం, మీ ధర్మం. ఈ దుష్టుడు మన జాతి కన్యను ప్రేమించానని చెప్పి, మాకు తెలియకుండా నగరానికి తీసుకుపోతూ, దొరికిపోయాడు. వీడికి తగిన దండన విధించండి!" అన్నారు.

భట్టలోల్లటుడు కొద్దిసేపు ఆలోచించి. తన జాతి కన్యను పిలిపించి, నాగరిక యువకుడితో ఆమె వివాహం జరిపించి, జాతి పెద్దలను మందలించి పంపివేశాడు. అంతే కాక, నాగరికులా, ఆటవికుల మధ్య వివాహాలు నిషిద్ధం కాదని శాసనం చేశాడు.

అయితే, ఈ శాసనం కారణంగా ఆటవికుల్లో పెద్ద కలకలం రేగింది. ఇది ఆటవికుల సంప్రదాయాలకూ, ఆచారాలకూ విరుద్ధమంటూ కొందరు ఆటవిక నాయకులు ప్రచారం చేసి, జనాన్ని కూడగట్టుకుని భట్టలోల్లటుడిపై తిరుగుబాటు చేసి, రాజధానీనగరాన్ని ఆక్రమించేందుకు బయలుదేరారు. వీళ్ళ నాయకుడు సింగారవేలుడు. వాడు భట్టలోల్లటుడి పినతండ్రి కొడుకు. రాజధానికి సమీపాన గల మైదానప్రాంతంలో, భట్టలోల్లటుడు తన సైన్యంతో వాళ్ళను ఎదిరించాడు.

ఇక యుద్ధం కొద్ది క్షణాల్లో జరగనున్న సమయంలో, భట్టలోల్లటుడి పక్కన వున్న సేనాని ఒకడు, అతడికి శత్రుపక్షాన ముందు నిలబడినవాళ్ళను చూపుతూ, "మహారాజా, అందరూ మీ జాతివాళ్ళు. వాళ్ళ నాయకుడు తమ పినతండ్రి కుమారుడు. స్వజాతివాళ్ళను చంపడం ధర్మం అనిపించుకుంటుందా! సంధికి ఒప్పుకోవడం మేలుకదా," అన్నాడు.

భట్టలోల్లటుడు, సేనానికేసి తీవ్రంగా చూసి, సైనికులను యుద్ధానికి పురిగొల్పి, వీరావేశంతో విజృంభించి, ఎదిరించిన స్వజాతి వాళ్ళందరినీ చంపివేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఆకలికి ఓర్వలేక ఒక ఆటవికుడు జాతి నిషిద్ధ ఆహారమైన కుందేలును చంపి తిన్నందుకు, వాణ్ణి భట్టలోల్లటుడు ఎలుగుబంట్లు తిరుగాడే అరణ్యానికి తరిమి శిక్షించాడు. అలాంటివాడు స్వజాతివాళ్ళు అనాచారంగా భావించే ఆటవిక, నాగరికుల మధ్య వివాహాలను ఎందుకు ప్రోత్సహించాడు? ఆ ప్రయత్నంలో స్వజాతీయులనే గాక, ఆత్మబంధువులను కూడా ఎందుకు చంపాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సంప్రదాయం, ఆచారాలనేవి ఆయా జాతులకూ, వ్యక్తులకూ మాత్రమే పరిమితమైనవి. భట్టలోల్లటుడు ఒక జాతి నాయకుడుగా—ఆ జాతివాళ్ళు నమ్మే ఆచారాలకు అనుగుణంగా, ఒక యువకుణ్ణి శిక్షించాడు. కాని, అనేక జాతులతో కూడిన రాజ్యానికి ఏలికగా, అతడు సంప్రదాయాలకూ, ఆచారాలకూ అతీతమైన ధర్మాన్ని చేపట్టవలసి వున్నది. అతడిప్పుడు ఏదో ఒక జాతినాయకుడు కాదు; వైశాలీరాజు. అలాంటి స్థితిలో అతడు ఏదో ఒక జాతి వాళ్ళ నమ్మకాలకు కట్టుబడి వుండడం న్యాయం, ధర్మం అనిపించుకోదు. ఆ కారణంవల్లనే, భట్టలోల్లటుడు తన జాతి కన్యకూ, నాగరిక యువకుడికీ స్వయంగా వివాహం జరిపించాడు. దాని ఫలితంగా, స్వజాతీయులు చేసిన తిరుగుబాటును, వైశాలీరాజ్య రక్షణకోసం నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు. ఇది స్వజాతి వాళ్ళను చంపడం అనిపించుకోదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: డా॥ తాటిచెర్ల గురురామ ప్రసాద్ రచన]






# మతిమరుపు

రాచవరం అనే గ్రామంలో వుండే పరంధామయ్య వట్టి మతిమరుపు మనిషి. ఆయన చెప్పిన పనిని మరిచిపోవడమో, లేక దానికిబదులు మరొక పని చేసుకు రావడమో చేస్తూండేవాడు. ఇందువల్ల ఆయన అస్తమానూ భార్య సాధింపులకు గురవుతూండేవాడు.

పరంధామయ్య వున్న గ్రామానికి కొద్ది దూరంలో, శాంతిపురం అనే పట్టణం వున్నది. గ్రామప్రజలు తమ అవసరాలకు ఏమి కావాలన్నా, శాంతిపురానికి వెళుతూండేవాళ్ళు. ఒకసారి పరంధామయ్య భార్య జానకమ్మ, ఇంట్లోకి అవసరం అయిన వస్తువులేమిటో ఆయనకు వివరంగా చెప్పి, పట్టణం వెళ్ళి రమ్మని పురమాయించింది.

పరంధామయ్య, భార్యతో, ''నేను ఎలాగూ మతిమరుపుమనిషినని నాకే కాదు, నీకూ తెలుసుకదా! ఇన్ని వస్తువులు ఎలా గుర్తుపెట్టుకోగలను? అవన్నీ ఒక కాగితం మీద రాసియిస్తే వెంట తీసుకుపోతాను,'' అన్నాడు.

అందుకు జానకమ్మ, ''ఆహాఁ, ఇన్నాళ్ళకు, యిన్నేళ్ళకు మీ బుర్రకు తెలివైన ఆలోచన తట్టింది,'' అని నవ్వి, వస్తువుల వివరాలన్నీ ఒక కాగితం మీద రాసి పరంధామయ్యకు ఇచ్చింది. పరంధామయ్య వెంటనే పట్టణానికి బయలుదేరాడు.

అయితే, సాయంత్రానికి వట్టిచేతులతో తిరిగి వచ్చిన భర్తను చూసి జానకమ్మ ఆశ్చర్యపోయి, ''కావలసిన వస్తువులన్నీ కాగితంలో వివరంగా రాశానుకదా! ఏమీ తీసుకురాకుండానే వచ్చావేమిటి? కొంపదీసి కాగితాన్ని పట్టుకుపోవడం మరిచిపోలేదుగదా?'' అని అడిగింది.

రాంబాబు

పరంధామయ్య చిరునవ్వు నవ్వి, ''అదేం లేదు. అంత పెద్ద మతిమరుపు పని చేస్తానా! కాగితాన్ని చాలా జాగ్రత్తగా జేబులో పెట్టుకుపోయాను. కానీ,దానితోపాటు జేబులో డబ్బు పెట్టుకుపోవడం మరిచాను,'' అన్నాడు.

''అంతా నా ఖర్మ!'' అని జానకమ్మ విసుక్కుని, ''అయితే, కాగితంతోపాటు డబ్బు కూడా తీసుకుని రేపు పట్టణం వెళ్ళిరండి. ఈ రోజుకు ఎలాగూ పొద్దు పోయిందికదా,'' అన్నది.



ఆ మర్నాడు తెల్లవారకుండానే పరంధామయ్య బయలుదేరి పట్టణం వెళ్ళాడు. మళ్ళీ సాయంకాలానికల్లా వట్టి చేతులతో తిరిగి వచ్చిన భర్తను చూసి, జానకమ్మ, ''కనీసం నాతో మాట మాత్రంగానైనా చెప్పకుండానే చీకటితో బయలుదేరి పట్నం వెళ్ళారు. ఈసారి కూడా వట్టి చేతులతో తిరిగి వచ్చారు. ఏం జరిగింది?'' అని అడిగింది.

పరంధామయ్య బాధపడిపోతూ, ''ఇంతకూ నాదశ ఏమాత్రం బావున్నట్టు లేదు. ఏం చేయను! సరుకులు కొనడానికి తీరా కొట్టుదగ్గిరకు వెళ్ళి, జేబు చూసుకుంటే, అందులో కాగితం లేదు, డబ్బు కూడా లేదు. దారిలో ఎవడో దొంగవెధవ జేబంతా ఖాళీ చేసినట్టుంది!'' అన్నాడు.

ఆ జవాబుకు జానకమ్మ నవ్వుతూ, ''మీ మతిమరుపు మరో రెండు జన్మలెత్తినా కూడా పోయేటట్టులేదు!'' అన్నది.

''ఆ జన్మల సంగతలా వుంచు. ముందు ఈ జన్మ సంగతేమిటి? అంత వల్లమాలిన మతిమరుపుతో సంసారం ఈదుకురావడం మహాకష్టం!'' అంటూ నిట్టూర్చాడు పరంధామయ్య.

''నేననవలసినమాట, మీరే అన్నారు, బావుంది. జేబు ఎవరో దొంగ ఖాళీ చేశాడన్న సంగతి మరిచిపోయి కాస్త ఆలోచించండి!'' అన్నది జానకమ్మ.

భార్య మాటల్లో ఏదో గూఢార్థం వున్నదని గ్రహించిన పరంధామయ్య, ఆమె

ముఖం కేసి పరీక్షగా చూస్తూ, ''నాకు మతిమరుపు కారణంగా, ఆలోచించే శక్తి సన్నగిల్లుతూన్నట్టున్నది. ఆ ఆలోచించే దేదో, నువ్వే ఆలోచించి చెప్పు,'' అన్నాడు.

''మీరు రాత్రి పడుకోబోయేటప్పుడు, నేనిచ్చిన వస్తువుల జాబితా కాగితంతో పాటు, జేబులో వస్తువులు కొనడానికి కావలసిన డబ్బు కూడా పెట్టుకున్నారు. కానీ తెల్లవారుజామున పట్నం బయలు దేరేటప్పుడు, ఆ చొక్కా బదులు మరొక చొక్కా తొడుక్కున్నారు. ఆ సంగతే మీకు గుర్తులేదు,'' అన్నది జానకమ్మ.

''జరిగింది అదన్నమాట! పట్నం నుంచి వట్టిచేతులతో తిరిగి వచ్చేటప్పుడు, నా మతిమరుపుకూ, డబ్బు పోయినందుకూ నా మీద నాకే కోపం వచ్చింది. ఇలాంటి పొరబాటు జరక్కుండా ఒక పని చేద్దాం,'' అన్నాడు పరంధామయ్య ఉత్సాహంగా.

''అదేమిటో చెప్పండి మరి!'' అన్నది జానకమ్మ.

''వస్తువులు రాసివున్న కాగితాన్నీ, డబ్బునూ ఇప్పుడు నేను తొడుక్కున్న చొక్కా జేబులోనే పెట్టు. రాత్రికి నేను చొక్కా విప్పకుండానే అలాగే పడుకుని నిద్రపోతాను. ఇలా చేస్తే, నేను మరిచి పోతానేమో అన్న శంకకే అస్కారం వుండదు. ఏమంటావు?'' అన్నాడు పరంధామయ్య.

''ఏమంటాను—మీ ఆలోచన చాలా బావున్నదంటాను!'' అని జానకమ్మ ఒక క్షణం ఆగి, ''పట్నం నుంచి సరుకులు కొని తీసుకురావడం, మీకు సాధ్యమయే పని కాదు. అందుచేత, ఈ ఉదయం పక్కింటిలో వున్న కోదండం అన్నయ్య గారిని బతిమాలి, ఆయన చేతికి సరుకుల చీటీ, డబ్బూ ఇచ్చాను. మీరు పట్నం నుంచి తిరిగి వచ్చేటప్పటికే, ఆయన మనకు కావలసినవన్నీ తెచ్చిపెట్టారు,'' అన్నది.



# చందమామ అనుబంధం—23

## మన విజ్ఞాన సంపద

## ఎవరాయన?

ఒక కవి భగవంతుడి కల్యాణ గుణగణాలను కీర్తిస్తూ, ఒక గీతంలో కొన్ని చరణాలు రాసి ఒకచోట ఆగిపోయాడు. ఆ తరవాత ఏమి రాయడమా అని కొంతసేపు తీవ్రంగా ఆలోచించి, ఎటూ తోచక—తాళపత్రం, ఘంటం అక్కడే వుంచి, ఆ విషయం గురించే ఆలోచిస్తూ స్నానానికి బయలుదేరాడు. స్నానం చేసి తిరిగి వచ్చినప్పుడు, భార్య భోజనం చేస్తూ వుండడం చూసి ఆయన విస్తుపోయాడు. ఎందుకంటే తను భోజనం చేశాక గాని, తన భార్య భుజించదు. అయినా, ఆయన భార్య కూడా భర్తకేసి ఆశ్చర్యంగా చూస్తూ, ''ఇప్పుడే కదా మీరు గీతరచనను పూర్తిచేసి, భోజనం చేసి అటు వెళ్ళారు!'' అని అడిగింది.

ఆయన వెళ్ళి తాళపత్రాన్ని తీసి చూశాడు. తాను మనసులో రాయాలనుకుని, రాయకుండా అలాగే వుంచి, వెళ్ళిపోయిన చరణంతో గీతం పూర్తి చేయబడి ఉన్నది! దేవుడే తన రూపంలో వచ్చి గీతాన్ని పూరించి వెళ్ళాడని గ్రహించి ఆ కవి పరమానందం చెందాడు.

ఎవరాయన ? (36 వ పేజీ చూడండి)

## మీకు తెలుసా?

1. మన దేశం స్వాతంత్ర్యం పొందినప్పుడు భారత జాతీయకాంగ్రెస్ అధ్యక్షుడు ఎవరు ?
2. 'గంగైకొండ' అన్న బిరుదు గలిగిన రాజు ఎవరు ? ఆయనకు ఆ బిరుదు ఎలా వచ్చింది ?
3. ఆయన నిర్మించిన నగరం ఏది ?
4. ఉన్నత వ్యక్తులకు భారత కేంద్రప్రభుత్వం ఇచ్చే నాలుగు బిరుదులు ఏవి ?
5. ప్రాచీన భారతదేశంలో పేరు గాంచిన రేఖాగణితశాస్త్రజ్ఞులెవరు ?

(36 వ పేజీ చూడండి)

# సింధు నాగరికత




సింధునదిని ఆంగ్లంలో 'ఇండస్' అని అంటారు. దాని ఆధారంగానే భారత దేశానికి ఇండియా అన్న పేరు ఏర్పడింది. సింధునది కాశ్మీరు, పంజాబుల గుండా ప్రవహిస్తూ, అరేబియా సముద్రంలో సంగమిస్తున్నది. మార్గమధ్యంలో ఈ నదిలో సోహన్, జీలం, చీనాబ్, రావి, బియాస్, సట్లజ్ నదులు కలుస్తున్నవి!

సింధునదిని అనుకుని వున్న లోయను కూడా 'సింధు' అనే అంటారు. కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే ఈ లోయలో అద్భుతమైన నాగరికత వెలసింది. హరప్పా, మహెంజొదారో నాగరికతలను గురించి విననివారంటూ ఉండరు. ఐదువేల సంవత్సరాలకు పూర్వమే వెలసిన అద్భుతమైన నగర శిథిలాలు ఈ ప్రాంతాలలో బయట

పడ్డాయి. విశాలమైనవీధులతో, బ్రహ్మాండమైన భవనాలతో, ఉద్యానవనాలతో ఈ నగరం వెలిసేదని పరిశోధనలవల్ల వెల్లడయింది. అద్భుతమైన పనితనం గల రాగి, ఇత్తడి, కంచు, సీసం, వెండి, బంగారు వస్తువులు ఈ రెండు ప్రాంతాలలోనూ లభించాయి.

సింధుప్రాంతం ఎన్నో రాజ్యాల స్థాపనలనూ, పతనాలనూ చూసింది. ప్రాచీన భారతీయ సాహిత్యం దీనిని సుసంపన్న సుందర రాజ్యంగా అభివర్ణిస్తున్నది. అలెగ్జాండర్ చక్రవర్తి దీనిపై దండెత్తాడు. సింధును పరిపాలించిన కట్టకడపటి గొప్పరాజు దహీర్, క్రీ. శ. 711 వ సం॥ ముహమ్మద్ ఖాసిం దండయాత్రను ఎదుర్కొని, వీరమరణం పొందాడు.

1947 వ సం॥లో జరిగిన భారత విభజన కారణంగా, సింధు ప్రాంతం ప్రస్తుతం పాకిస్తాన్‌లో భాగమయింది. కరాచీ సింధు ప్రాంతంలో పెద్ద నగరం!

## చందమామ కబుర్లు




### ఎత్తయిన మనిషి!

గత జూలై మాసంలో వెలువడిన నివేదిక ప్రకారం, బంగ్లాదేశ్‌కు చెందిన ఇరవై ఆరేళ్ళ ప్రాయం గల పరిమళ్‌బర్మన్ ప్రపంచంలోకెల్లా కెల్లా ఎత్తయిన మనిషి అని తెలుస్తున్నది. అతని ఎత్తు 8 అడుగులా 2 అంగుళాలు. ఢక్కాలో అతడు ఆస్పత్రిలో చేరినప్పుడు అతనికని ప్రత్యేకంగా ఒక మంచం తయారు చేయవలసి వచ్చింది!

### సరికొత్త రికార్డు!

భోపాల్‌కు చెందిన బ్రిజేష్ శ్రీవాస్తవ్ అనే ఇరవై రెండేళ్ళ యువకుడు జూలై 15 న, సూది (13 వ నం) లోకి 6,062 సార్లు నూలుదారాన్ని ఎక్కించి, సరికొత్త రికార్డును సృష్టించి 'గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్'లో చోటు సంపాయించాడు!



# సాహిత్యావలోకనం

1. యముడి ద్వారా మరణరహస్యాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించిన నచికేతుడి ప్రస్తావన ఎందులో ఉన్నది?
2. మాతృత్వం, పిల్లలు, ప్రకృతి, దేవుడు మొదలైన అంశాల మీదే ఎక్కువగా కవిత్వం రాసిన నోబెల్ బహుమతీ గ్రహీత ఎవరు?
3. ఆమె ఏ దేశానికి చెందినవారు?
4. ఆమెకు ఎప్పుడు నోబెల్ బహుమతి లభించింది?
5. మన దేశంలో లిపిలేని భాషలతో సహా మొత్తం ఎన్ని భాషలు మాట్లాడుతున్నారు?

## సమాధానాలు

**ఎవరాయన?**

గీతాగోవిందం రచించిన జయదేవుడు.

**లోకజ్ఞానం**

1. డా॥ రాజేంద్రప్రసాద్.
2. రాజేంద్రచోళుడు (క్రీ. శ. 11 వ శతాబ్దం). గంగ రాజులను జయించడం వల్ల.
3. ఈనాటి తమిళనాడులోని 'గంగైకొండచోళపురం'.
4. అత్యున్నతమైనది భారతరత్న. పద్మవిభూషణ, పద్మభూషణ, పద్మశ్రీ అన్నవి మిగతా మూడు.
5. ఆర్యభటుడు (6 వ శతాబ్దం) వరాహమిహిరుడు (6 వ శతాబ్దం) బ్రహ్మగుప్తుడు (7 వ శతాబ్దం) మహావీరాచార్యుడు (9 వ శతాబ్దం) భాస్కరాచార్యుడు (12 వ శతాబ్దం).

**సాహిత్యం**

1. ఋగ్వేదంలో.
2. గేబ్రీలా మిస్ట్రాల్ (1889–1957)
3. చిలీ
4. 1945
5. 1971 జనాభా లెక్కలప్రకారం 700 భాషలు.



# శ్రీ రామకృష్ణపరమహంస (4)

ఒకనాడు నదిలోని పడవ నుంచి వెలువడి, నదీతీరానికి చేరిన ఒక విచిత్ర స్త్రీని గదాధరుడు చూశాడు. చేతిలో త్రిశూలంతో, ముఖంలో అధ్యాత్మిక సాధన ద్వారా సిద్ధించిన వింత తేజస్సును వెదజల్లుతూ వచ్చిన ఆ స్త్రీ—తంత్ర విద్యలో ప్రావీణ్యం సాధించిన భైరవి!

గదాధరుడు భైరవిని తన తల్లి లాగా భావించి, చేతులు జోడించి ఆహ్వానించాడు. గదాధరుడు మహాపురుషుడని గ్రహించి, భైరవి ఆయనకు తంత్రశాస్త్ర రహస్యాలను తెలియజేసింది.





భైరవి ఒకనాడు తన ఇష్టదేవతకు నైవేద్యం ఉంచి, కళ్ళు మూసుకుని ధ్యానంలో కూర్చున్నది. అప్పుడు గదాధరుడు అక్కడికి వచ్చి, నైవేద్యాన్ని ఆరగించసాగాడు. కళ్ళు తెరిచి ఆ దృశ్యాన్ని చూసిన భైరవి ఆగ్రహించలేదు. పైగా పరమానందం చెందింది. ఎందుకంటే, తన ఇష్టదేవత గదాధరుడి రూపంలో నైవేద్యాన్ని స్వీకరిస్తున్నట్టు ఆమెకు దర్శనమిచ్చింది!



మాథుర్‌బాబా ఏర్పాటు చేసిన పండితుల సభలో, భైరవి చక్కటి ఉపన్యాసం ఇచ్చింది. శృతులు, పురాణాలు పేర్కొనే అవతార లక్షణాలన్నీ గదాధరుడిలో ఉన్నాయనీ, ఆయన అవతార పురుషుడనీ వివరించింది. ఆమె మాటలకు ఏ ఒక్కరూ ఎదురు చెప్పలేక పోయారు.

ఒకనాడు రామభక్తుడయిన ఒక సాధువు దక్షిణేశ్వరానికి వచ్చాడు. ఆయన తనతో ఒక చిన్న బాల రామవిగ్రహాన్ని తెచ్చుకున్నాడు. ఆ బొమ్మను ఆయన రామ్‌లాలా అని పిలిచేవాడు. ఆయన ఆ చిన్న విగ్రహంతో, మనిషితో మాట్లాడినట్టే మాట్లాడేవాడు. ఆ విషయాన్ని గదాధరుడు ఎంతో ఆసక్తితో గమనించాడు.





గదాధరుడు, అక్కడి నుంచి తన గదికి తిరిగి వచ్చినప్పుడు, ఒక అందాల పసివాడు, తన వెంట రావడం పసిగట్టాడు. రామవిగ్రహంలోని రామ్‌లాలా తేజస్సే అలా వచ్చిందని ఆయన గ్రహించి ఎంతగానో మురిసిపోయాడు.

రామ్‌లాలా గదాధరుణ్ణి క్షణం కూడా వదిలి ఉండేవాడుకాదు. తనకు పళ్లూ, ఫలహారాలూ తినిపించమనీ, తనతో ఆడుకోమనీ మారాం చేసేవాడు. అయితే సాధువు సమీపిస్తే మాత్రం ఆ క్షణమే ఎటో మాయమైపోయేవాడు!





గదాధరుడు నదికి స్నానానికి వెళ్ళేప్పుడు రామ్‌లాలా ఆయన వెంట వెళ్ళేవాడు. నదిలో స్నానం చేస్తూ ఎంతకూ గట్టు మీదికి వచ్చేవాడుకాదు. ఒక్కొక్కసారి గదాధరుడు రామ్‌లాలాను మందలించినప్పటికీ ఆ తరవాత ఎంతో బాధపడేవాడు.

ఒకనాడు సాధువు గదాధరుడితో, "నాయనా, రామ్‌లాలా నిన్ను వదిలి రావడానికి ఇష్టపడటం లేదు. అయినా, నాకు కావలసిన అనందాన్ని నాకు ప్రసాదిస్తూనే ఉన్నాడు. కావాలంటే ఈ విగ్రహాన్ని నీ దగ్గిరే ఉంచుకో," అని చెప్పి రామవిగ్రహాన్ని ఇచ్చి వెళ్ళాడు.





అనాటి సుప్రసిద్ధయోగి తోతాపురి, నదీ తీరంలో తిరుగుతూ, ఏకాంతంగా కూర్చుని ఉన్న గదాధరుణ్ణి చూశాడు. అయనను చూడగానే, తనకు తెలిసిన వేదాంతార్థాలను వివరించి చెప్పడానికి పాత్రుడయిన మహానుభావుడు లభించి నట్టు భావించి సంతోషించాడు.

తోతాపురి గదాధరుణ్ణి సమీపించి, "నాయనా, నువ్వు యోగవిద్య నభ్య సిస్తావా? లేక వేదాంతమార్గం అవలం బిస్తావా?" అని అడిగాడు. దానికి గదా ధరుడు, "నా తల్లి ఆదేశాన్ని పాటిస్తాను," అని చెప్పి తిన్నగా కాళీ మాత మందిరంలోకి వెళ్ళి ఆమెను మనసారా ప్రార్థించి, తోతాపురి వద్దకు తిరిగివచ్చి, "ఇప్పుడు నేను సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.





ఒకనాడు వేకువజామున, పవిత్ర అగ్నిని రగిలించి, తోతాపురి మంత్రాలు ఉచ్చరిస్తూ, గదాధరుణ్ణి చెప్పమన్నాడు. ప్రాథమిక తతంగాలు పూర్తయ్యాక, తోతాపురి గదాధరుడికి సన్యాసం ఇప్పించి, రామకృష్ణుడని నామకరణం చేశాడు!

—(ఇంకావుంది)



# చదువురాని వాళ్ళు

పూర్వం ఒక జమీందారీ గ్రామంలో ఒక పేదరైతు ఉండేవాడు. అతనికి గల ఆస్తి ఒక ముసలి ఆవు. అది పొలాల కంచెల వెంబడి గడ్డి మేసి పొట్టపోసు కుంటూ ఉండేది.

ఆ ఆవు ఒకసారి జమీందారు పొలం పక్కన మేస్తూ ఉండగా పొలంలో మంచి నవనవలాడే మొక్కలు కనిపించాయి. ఆ మొక్కలను తినాలన్న కోరిక ఆవుకు బలంగా కలిగింది. కంచె కొద్దిగా పడిపోయి ఉన్నచోట అది దూరి, పొలంలో ప్రవేశించింది. అది చూసి, జమీందారుగారి మనిషి దుడ్డుకర్ర పెట్టి ఒక్కదెబ్బ వేశాడు. ఆ ఒక్క దెబ్బకే ఆ ముసలి ఆవు చచ్చి ఊరుకున్నది.

తమకున్న ఒక్క ఆవూ పోయినందుకు రైతూ, అతని భార్యా చాలా విచారించారు. రైతు జమీందారు వద్దకు వెళ్ళి, తన ఆవును చంపినందుకు పరిహారం ఇవ్వమని కోరాడు.

''నీకు పరిహారం కావాలా?'' అంటూ జమీందారు తన నౌకర్లచేత రైతును పది కొరడాదెబ్బలు కొట్టించాడు.

రైతు తన ఇంటికి తిరిగివచ్చి, జరిగినదంతా భార్యకు చెప్పాడు.

''జమీందారుగారు మనకు అన్యాయం చేస్తుంటే, రాజుగారి దగ్గిర ఫిర్యాదు చెయ్యటం తప్ప మనకు మరోమార్గం లేదు. రాజుగారు ధర్మాత్ముడు. అక్కడికి వెళితే, మనకాయన తప్పక న్యాయం చేస్తాడు,'' అన్నది రైతు భార్య.

కాని ఫిర్యాదు తయారుచేసే దెట్లా? వాళ్ళిద్దరూ చదువురానివాళ్ళు. అందుచేత వాళ్ళొక చెక్క పలక తయారు చేశారు. దాని మీద తమ గుడిసెబొమ్మా, జమీందారుగారి భవంతీ, జమీందారు

చేనూ, దాని కంచే, అందులో శిథిలమైన భాగమూ, జమీందారు నౌకరు కొడితే అవు పడిపోయి ప్రాణాలు వదిలిన చోటూ బొగ్గుతో గీశారు. జమీందారు తనను కొట్టించిన పది కొరడాదెబ్బలకూ పది గీతలు కూడా చేర్చాడు రైతు. ఫిర్యాదులో వివరాలన్నీ చేరాయి.

రైతు ఆ కొయ్యపలకను తన వీపుకు కట్టుకుని రాజధానికి బయలుదేరాడు. పోగా, పోగా, ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో రైతుకు ఒక వేటగాడు కనిపించి, "ఎక్కడికి ప్రయాణం?" అని అడిగాడు.

"రాజుగారిని చూసి ఒక ఫిర్యాదు అందించాలి. ఇదుగో, నా వీపుకు కట్టుకున్నది అదే," అన్నాడు రైతు.

"దేన్ని గురించి ఫిర్యాదు ?" అన్నాడు వేటగాడు.

"ఏం చెప్పేది ? నిక్షేపమంటి మా ఆవును చంపేశారు," అంటూ రైతు ఒక చోట చతికిలబడి, పక్కనే వేటగాణ్ణి కూడా కూర్చోబెట్టి, తన వీపు నుంచి కొయ్యపలక తీసి అందులోని ఒక్కొక్కటీ చూపుతూ, జరిగినదంతా చెప్పి, పలక మీద గీసిన బొమ్మలన్నీ వేటగాడికి వివరించాడు.

అంతా విని ఆ వేటగాడు, "బాగుంది! ఈ ఫిర్యాదు రాజుగారికి చూపించావంటే నీకు తప్పక న్యాయం జరుగుతుంది," అంటూ అక్కడినుంచి లేచి తన దారిన తాను సాగిపోయాడు.



ఆ వేటగాడే రాజన్న సంగతి రైతుకు తెలియదు.

రైతు అడవి దాటి రాజధాని చేరాడు. రాజభవనం వద్ద అతను లోపలికి వెళ్ళటానికి అనుమతి లభించింది. విశాలమైన చావడిలో రాజుగారూ, పన్నెండుమంది మంత్రులూ కూర్చుని ఉన్నారు. రాజు ఇప్పుడు రాజలాంఛనాలు ధరించి ఉండటంచేత రైతు ఆయనను గుర్తించలేదు. అతను తన ఫిర్యాదు పలకను, దగ్గిరలో ఉన్న మంత్రికి చూపి, "ఈ ఫిర్యాదు చిత్తగించండి. విషయమంతా అందులో ఉన్నది," అన్నాడు.

మంత్రి పలక కేసి చూసి, "ఇదేం ఫిర్యాదు? అంతా అయోమయంగా ఉన్నదే!" అంటూ దాన్ని మరొక మంత్రికి అందించాడు.

అందరు మంత్రులూ దాన్ని చూశారు ఒక్కరికీ అదేమిటో తెలియలేదు.

"పీడెవడో వెర్రివాడు లాగున్నాడు బయటికి గెంటండి," అన్నారు వాళ్ళు.

రాజు వాళ్ళను వారించి, ఆ పలకను తాను పుచ్చుకుని, రైతుతో, "ఇదేనా నీ గుడిసె?" అంటూ వేలితో పలకమీద చూపాడు.

"అవును, స్వామీ!" అన్నాడు రైతు.

"ఇది జమీందారు భవంతి కాదూ?" అన్నాడు రాజు.

"అందుకు సందేహమేమిటి, స్వామీ?" అన్నాడు రైతు.



''ఈ పొలం కంచె పడిపోయింది ఇక్కడేగా?'' అన్నాడు రాజు.

''సరీగా అక్కడే!'' అన్నాడు రైతు సంతోషంగా.

''ఇందులో నుంచి నీ ఆవు పొలంలోకి జొరబడితే జమీందారు మనిషి కొట్టి నప్పుడు, అది ఇక్కడ పడి చచ్చింది. అవునా?'' అన్నాడు రాజు.

''అయ్యో, స్వామీ! ఎందు కడుగు తారు?'' అన్నాడు రైతు పట్టరాని దుఃఖంతో.

''తరవాత ఈ పది గీతలూ, జమీం దారు నిన్ను కొట్టించిన కొరడా దెబ్బలన్న మాటేగా?'' అన్నాడు రాజు.

రైతుకు పరమానందమయింది. అతను రాజును చూసి, ''స్వామీ, తెలివంటే మీదే తెలివి. వీళ్ళంతా దండగే! ఒక్కడికీ బుర్ర లేదు!'' అన్నాడు.

మంత్రులందరూ విరగబడి నవ్వారు.

''సరే, నువ్వు మీ గ్రామం వెళ్ళి, నేను నీకు తప్పక న్యాయం జరిగేటట్టు తీర్పిస్తానని నీ భార్యతో చెప్పు!'' అన్నాడు రాజు.

రైతు సెలవు పుచ్చుకుని తన గ్రామానికి తిరిగివెళ్ళాడు. అతని వెనకనే రాజుగారి ఆనతి జమీందారుకు చేరింది.

జమీందారు స్వయంగా రైతు గుడిసెకు వచ్చి, జరిగినదానికి క్షమాపణ చెప్పుకుని రాజాజ్ఞ ప్రకారం రైతుకు ఒక ఇల్లు కట్టించి ఇచ్చి, ఒక గొడ్ల చావడీ, పశువుల దొడ్డీ, ఏడు పాడి ఆవులూ, అరవై ఎకరాల బంజరు భూమీ రాసి ఇచ్చి, తాను రైతుకు చేసిన అన్యాయానికి పరిహారం చెల్లించు కున్నాడు.

రైతూ, అతని భార్యా ఇప్పుడు చాలా సుఖంగా బతుకుతూ వచ్చారు. రాజుగారి ధర్మబుద్ధిని రైతు తరచుగా మెచ్చు కుంటూ ఉండేవాడు. అలా మెచ్చు కున్నప్పుడల్లా అతను, ''అంత తెలివిగల రాజు ఆ చదువురానివాళ్ళ నెందుకు జీతాలిచ్చి పెట్టుకున్నాడో!'' అని ఆశ్చర్య పోతూండేవాడు.






రాముడు తనను రావణుడు ఉండే చోటు అడిగేసరికి, అతని బాధ చూసి తాను కూడా కన్నీరు కార్చుతూ సుగ్రీవుడు, ''రామా, ఆ రావణుడు ఎక్కడ ఉంటాడో నాకు తెలియదు. కాని ఒక్క ప్రతిజ్ఞ చెయ్యగలను; సీత నీకు తిరిగి దొరకటానికి అవసరమైన ప్రయత్నం చేస్తాను. నీకు సంతోషం కలిగిస్తాను. నువ్వు ధైర్యంగా ఉండు. నేను కూడా నీ లాగే భార్యను పోగొట్టుకున్నాను. కాని ధైర్యాన్ని విడవలేదు,'' అన్నాడు.

సుగ్రీవుడు ఇలా ఊరడించేసరికి రాముడు కన్నీటితో తడిసిన తన ముఖాన్ని తుడుచుకున్నాడు. అతను సుగ్రీవుడితో, ''నిజమైన మిత్రుడి లాగా మాట్లాడావు. ఇప్పుడు నేనున్న స్థితిలో నీలాటి ఆప్తుడు దొరకటం నా అదృష్టం. నువ్వు మాత్రం రావణుడు ఎక్కడ ఉంటాడో, సీతను ఎక్కడ ఉంచాడో వెతికించాలి. పోతే, నా నుంచి నీకు ఏం కావాలో చెప్పు, ఆ పని నావల్ల అవుతుందా, కాదా అని సంశయించకు. నేను వాలిని చంపుతానన్నమాట యథార్థం. నేను ఇంతవరకు ఎన్నడూ అబద్ధం చెప్పలేదు, ఇక ముందు చెప్పను,'' అన్నాడు.

ఈ మాటలకు సుగ్రీవుడూ, అతని మంత్రులైన వానరులూ ఎంతో సంతోషించారు. సుగ్రీవుడు రాముడితో ఇలా అన్నాడు: ''రామా, నన్ను నా అన్న మోసం చేసి, నా భార్యను అపహరించాడు. నాకు

**4. వాలి సుగ్రీవుల యుద్ధం**



ఏం చెయ్యాలో తెలియదు. ఇలా బతుకుతున్నాను. బలవంతుడైన వాలి నన్ను రాజ్యభ్రష్టుణ్ణి చెయ్యటమే గాక, నన్ను చంపించటానికి అనేక ప్రయత్నాలు చేశాడు. అతను నా మీదికి పంపిన వానరులను ఎంతోమందిని నేను చంపాను. నేను నా అన్న భయం చేతనే నీ దగ్గిరికి కూడా రాలేదు. నా కిప్పుడు ఈ హనుమంతుడు మొదలైన వారు ఎంతో సహాయంగా ఉన్నారు. నాపట్ల స్నేహం కలిగి వాళ్ళు నన్ను రక్షిస్తున్నారు. నేను ఎక్కడికి పోతే అక్కడికి వస్తారు. నన్ను ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటారు. ఇలా ప్రాణభయంతో, ఈ పర్వతం మీద ఎంత కాలం జీవించేది! వాలి చస్తేనేగాని నాకు క్షేమం లేదు.''

రాముడు ఈ మాటలకు నవ్వి, ''నా ఒక్క బాణంతో వాలిని చంపగలను. నా కంటపడిన మరుక్షణం అతను చచ్చిపోతాడు. నువ్వు కూడా నేనున్న స్థితిలోనే ఉన్నావు. సందేహం లేదు. నీ దుఃఖం త్వరలోనే తీరిపోతుంది. ధైర్యం వహించు,'' అన్నాడు.

సుగ్రీవుడు రాముడికి వాలి బలసత్వాలను గురించి ఇలా చెప్పాడు: వాలి తెల్లవారకముందే లేచి, సూర్యోదయం అయేలోపల నాలుగు సముద్రాలలోనూ స్నానం చేసి, సంధ్యావందనం చేస్తాడు; పర్వత శిఖరాల మీదికి ఎక్కి, పెద్ద పెద్ద కొండ రాళ్ళను బంతుల్లాగా ఎగరవేసి పట్టుకుంటాడు; అరణ్యాలలో పెద్ద పెద్ద చెట్లను విరిచి తన బలం చూసుకుంటాడు; వెయ్యి ఏనుగుల బలం గల దుందుభి అనేవాణ్ణి చంపాడు.

దుందుభి ఎనుబోతు రూపం గల రాక్షసుడు. వాడు మదగర్వంతో మొట్టమొదట సముద్రుడి వద్దకు వెళ్ళి, తనతో ద్వంద్వ యుద్ధానికి రమ్మన్నాడు.

సముద్రుడు వాడితో, ''నాయనా, నీతో యుద్ధం చేసే శక్తి నాకు లేదు. అందుకు సమర్థుడు హిమవంతుడు. అతనితో

యుద్ధం చేస్తివా, నీ భుజాల తీట తీరు తుంది. కనక వెరటనే బయలుదేరి అక్కడికి పో,'' అని చెప్పాడు.

సముద్రుడు తనను చూసి భయపడ్డాడని సంతోషించి, దుందుభి శరవేగంతో హిమాలయానికి వెళ్ళి, ఏనుగులంతేసి కొండరాళ్ళను తన కొమ్ములతో విసిరేస్తూ, గర్జించాడు.

ఇది తెలిసి హిమవంతుడు ఒక కొండ శిఖరం మీదికి వచ్చి నిలబడి, ''దుందుభీ, నన్ను యుద్ధంతో ఎందుకు బాధిస్తావు? నేను యుద్ధం చెయ్యటానికి పనికి రాను. ఇక్కడ ఎందరో మునులు తపస్సు చేసుకుంటున్నారు. ఇది యుద్ధం చేసే స్థలం కాదు,'' అన్నాడు.



దుందుభి మహాకోపంతో, ''యుద్ధం చెయ్యటం నీకు చేతగాకపోతే చేతనైన వాడెవడో చెప్పు. వాణ్ణి క్షణాల మీద చంపి, నా శక్తి చూపుతాను,'' అన్నాడు.

''నీకు యుద్ధమే కావాలంటే కిష్కింధలో ఉండే వాలి వద్దకు వెళ్ళు. అతన్ని గెలవటం అసాధ్యం,'' అని హిమవంతుడు చెప్పాడు.

దుందుభి కిష్కింధానగర ద్వారం వద్దకు వచ్చి, గొప్ప గర్జన చేశాడు. వాడు అక్కడ ఉన్న చెట్లను విరుస్తూ, తన గిట్టలతో నేలను గీరుతూ, కొమ్ములతో నగర ద్వారాన్ని కొడుతూ ఆర్భాటం చేయటం వాలి విన్నాడు. అతను అంతఃపురం నుంచి స్త్రీజనాన్ని వెంట బెట్టుకుని దుందుభి వద్దకు వచ్చి, ''ఒరే దుందుభీ, నేను నిన్ను ఎరుగుదును. ఎందుకిలా గర్జిస్తున్నావు? ప్రాణాల మీద ఆశ లేదా?'' అని అడిగాడు.

ఈ మాటలకు దుందుభి మండిపడి, ''ఆడవాళ్ళ ముందు ప్రగల్భాలాడితే కాదు, నాతో యుద్ధం చేసి, నీ శక్తి చూపించు. లేదా, రేపు పొద్దుటి దాకా నీకు గడువు ఇస్తున్నాను. ఈలోగా నీ బాధ్యతలన్నీ తీర్చుకో. నీ బంధువులందరికీ ఇచ్చేసేది ఇచ్చెయ్యి; మిత్రులతో



చెప్పాకునేదంతా చెప్పుకో; నీ నగర మంతా ఒక్కసారి తిరిగి చూసుకో; నీ బదులు మరొకణ్ణి రాజుగా నియమించు. అప్పుడు నేను నీ మదం అణగిస్తాను,'' అన్నాడు.

వాలి స్త్రీజనాన్ని అంతఃపురానికి తిప్పి పంపి, దేవేంద్రుడు తన కిచ్చిన కాంచన మాలను మెడలో వేసుకుని, దుందుభి మీద కలియబడి, వాడి కొమ్ములు పట్టు కుని గిరగిరా తిప్పి, నేల కేసి కొట్టి, సింహనాదం చేశాడు. దుందుభి చెవుల నుంచి రక్తం వచ్చింది.

అయినా వాళ్ళిద్దరూ చాలా సేపు పిడి కిళ్ళతోనూ, మోకాళ్లతోనూ, రాళ్లతోనూ, చెట్లతోనూ యుద్ధం చేశారు. క్రమంగా దుందుభి బలం క్షీణించి, వాలి బలం పెరిగింది. అది చూసి వాలి దుందుభిని పైకెత్తి, నేల కేసి కొట్టి చంపేశాడు. తరవాత అతను దుందుభి కళేబరాన్ని ఎత్తి, ఊపి, ఆమడదూరం పోయి పడే టట్టు విసిరి వేశాడు. నోటి నుండి రక్తం కారుతున్న ఆ కళేబరం మతంగముని ఆశ్రమం మీదుగా వెళ్ళి పడింది. దాని తాకిడికి ఆశ్రమప్రాంతంలోని కొన్ని చెట్లు విరిగాయి.

ఆశ్రమంలో రక్తపు మరకలు చూసి, మతంగమహాముని కోపించి, అందుకు కారకుడు వాలి అని తెలుసుకుని, వాలి తన ఆశ్రమానికి ఆమడదూరంలో అడుగు పెడితే చస్తాడని శాపం పెట్టి, వాలి భృత్యులనందరినీ తన వనం నుంచి వెళ్ళగొట్టాడు; ఒక్క రోజులోపల వెళ్ళి పోని వాళ్ళు శిలలైపోతారన్నాడు.

తన వద్దకు తిరిగి వచ్చిన భృత్యులను చూసి వాలి, ''మీ రందరూ తిరిగి వచ్చా రేం? వానరులకు ప్రమాదం ఏదీ కలగ లేదు గద?'' అని అడిగాడు. వాళ్ళు జరిగినదంతా చెప్పారు. వాలి మతంగ మహామునిని శాపం ఉపసంహరించమని వేడుకున్నాడు. కాని ఆయన వినిపించుకో లేదు. అది మొదలు వాలి ఋశ్యమూక

పర్వతం కేసి చూడటం కూడా మానేశాడు. ఈ శాపం ఆపదసమయంలో సుగ్రీవుడికి లాభించింది. అతను తన మంత్రులతో ఋశ్యమూకం మీద నిర్భయంగా ఉంటున్నాడు.



సుగ్రీవుడు రాముడికి వాలిని గురించి ఇదంతా చెప్పి, రాముడికి దుందుభి కళేబరాన్ని చూపించి, "ఈ లావుపాటి మద్దిచెట్లు ఇక్కడ ఏడు ఉన్నాయి చూడు; వీటిలో దేనినుంచి అయినా దూసుకుపోయేటట్టు బాణం వేసేపాటి బలం వాలికి ఉన్నది. అలాంటి బలశాలిని యుద్ధంలో ఏ విధంగా చంపుతావు?" అని అడిగాడు.

ఈ మాటకు లక్ష్మణుడు నవ్వి, "ఇతను ఏం చేస్తే, వాలిని చంపగలడన్న నమ్మకం నీకు కుదురుతుంది?" అని అడిగాడు.

"రాముడు కూడా మద్దిచెట్టు నుంచి దూరి పోయేటట్టు బాణం కొట్టి, బాణంతో ఈ దుందుభి కళేబరాన్ని రెండు వందల బారల దూరం పోయి-పడేటట్టు కొట్టితే, ఇతను వాలిని చంపగలడని నమ్ముతాను," అని సుగ్రీవుడు లక్ష్మణుడితో అన్నాడు.

అతను రాముడి కేసి తిరిగి, "రామా, వాలి మహాబలశాలి. అతను ఇంతవరకూ అపజయం ఎరగడు. అతని బలం నాకు తెలుసు, కాని నీ బలం నాకు తెలియదు. అందుచేత, నిన్ను భయపెట్టటానికి నేనీ మాటలు చెప్పటం లేదు; వాలి అంటే నాకున్న భయంకొద్దీ చెబుతున్నాను," అన్నాడు.

రాముడు చిరునవ్వు నవ్వి, "నా పరాక్రమంలో నీకు నమ్మకం కలిగేటట్టు నేను చేస్తాను," అని, దుందుభి కళేబరాన్ని కాలి బొటనవేలితో ఎత్తి, పది ఆమడల దూరం పోయి పడేటట్టు విసిరాడు.

అది చూసిన సుగ్రీవుడు, "రామా, ఇప్పుడా కళేబరం ఎండి, తేలిక అయి



పోయింది. దుందుభితో భయంకరంగా యుద్ధం చేసి అలసిపోయి ఉన్న సమయంలో వాలి పచ్చికళేబరాన్ని ఇంత దూరం విసిరాడు. అందుచేత, నీకూ, వాలికీ బలంలో గల తేడా గురించి నా సందేహం తీరలేదు. ఒక్క మద్ది చెట్టు కుండా దూసుకుపోయేటట్టు బాణం వేశావంటే, మీ ఇద్దరి బలాబలాలు నాకు తెలుస్తాయి,'' అన్నాడు.

సుగ్రీవుడికి తన యందు నమ్మకం కలగ గలందులకు రాముడు ధనుస్సు చేత బట్టుకుని, ఒక బాణం తీసుకుని మద్దిచెట్టును కొట్టాడు. ఆ బాణం ఏడు మద్ది చెట్లనూ దూసుకునిపోయి, కొండను భేదించి, భూమిలోకి వెళ్ళిపోయింది. అది చూసి సుగ్రీవుడు నిర్ఘాంతపోయాడు. అతను చేతులు జోడించి, రాముడి ముందు సాష్టాంగ నమస్కారం చేసి, ''రామా, నువ్వు ఇంద్రుణ్ణి, దేవతలనూ కూడా జయించగలవు; వాలిని చంప గలవనటానికి సందేహం లేదు. నీ స్నేహం కలిగినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను,'' అన్నాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో సంప్రదించి, ''సుగ్రీవా, మనం బయలుదేరి కిష్కింధకు పోదాం. నువ్వు మాకన్న కొంచెంముందుగా వెళ్ళి, వాలిని యుద్ధానికి పిలువు,'' అన్నాడు.

వెంటనే రామలక్ష్మణులూ, సుగ్రీవుడి అనుచరులూ కిష్కింధకు వెళ్ళి, నగరం వెలుపల ఉన్న వనంలో చెట్ల చాటున దాక్కున్నారు.

సుగ్రీవుడు దట్టి గట్టిగా బిగించి, వాలిని పిలవటానికి భయంకరమైన గర్జనలు చేశాడు. తన తమ్ముడి పిలుపు విని కోపించి, వాలి వచ్చాడు. ఇద్దరూ దారుణంగా యుద్ధం చేశారు; ఒకరి నొకరు పిడికిళ్ళతోనూ, అరచేతులతోనూ కొట్టుకున్నారు, పట్టుకున్నారు.

వారిద్దరూ ఒకేపోలికగా ఉండటం చేత రాముడికి, వారిలో ఎవరు సుగ్రీవుడో,

ఎవరు వాలో తెలియరాలేదు. అందుచేత అతను బాణం వదలలేక పోయాడు. ఈ లోపల సుగ్రీవుడు ఓడిపోయి పారిపోసాగాడు.

వాలి అతన్ని మతంగమహాముని ఆశ్రమం దాకా వెంటబడి తరిమి, సుగ్రీవుడు నెత్తురు ఓడుతూ మతంగాశ్రమం ప్రవేశించగానే, "బతికిపోయావు పో!" అని కిష్కింధకు తిరిగివెళ్ళాడు.

రాముడు హనుమంతుణ్ణీ, లక్ష్మణుణ్ణీ వెంట బెట్టుకుని తాను కూడా సుగ్రీవుడి వెనక వెళ్ళాడు. సుగ్రీవుడు రాముణ్ణి చూసి తల వంచుకుని, "నీ పరాక్రమం చూపినవాడివి, నన్ను వాలి పైకి యుద్ధానికి పంపి, వాలి చేత చావుదెబ్బలు తినిపించావే, ఇదేం పని? వాలిని చంపటం నీకు చేతగాదని ముందే చెబితే నేను వెళ్ళనే వెళ్ళను గద!" అని దీనంగా అన్నాడు.

"సుగ్రీవా, నేను వాలిని కొట్టక పోవటానికి కారణం చెబుతాను విను. మీ ఇద్దరి అలంకరణలూ, రూపాలూ, నడకా, కంఠధ్వనీ, కళ్ళూ, శరీరచ్ఛాయా ఒకేవిధంగా ఉన్నాయి. మీ ఇద్దరిలో నాకు కొంచెం కూడా తేడా తెలియరాలేదు. మొదటికే మోసం వస్తుందని నేను బాణం విడవలేదు. నీకు అభయం ఇచ్చినవాణ్ణి భ్రమపడి నీ ప్రాణమే తీస్తే అది మహాపాపం కదా? నేనూ, లక్ష్మణుడూ, సీతా కూడా నీ ఆధీనంలో ఉన్నవాళ్ళం. నన్ను గురించి సందేహించక, నువ్వు మళ్ళీ వెళ్ళి వాలితో యుద్ధం చెయ్యి. ఈసారి నాకు గుర్తుగా ఉండేటందుకు ఏదైనా ధరించు. ఒకే ఒక్క బాణంతో వాలిని చంపుతాను. లక్ష్మణా, పూసి ఉన్న ఈ గజపుష్పిని తెంపి, సుగ్రీవుడి మెడకు చుట్టు," అన్నాడు రాముడు.

సుగ్రీవుడికి రాముడి మాటలలో ఈసారి గట్టి నమ్మకం కుదిరింది. అతను ఎంతో ఉత్సాహంగా గజపుష్పి మెడకు చుట్టుకుని, మళ్ళీ కిష్కింధకు బయలుదేరాడు.





# అభిలాష

సుబోధుడనే గురువు దగ్గిర వత్సలుడనే వాడు శిష్యరికం చేస్తూ, విద్యాభ్యాసం పూర్తి అయినప్పటికీ గురువుకు సేవలు చేస్తూ వుండిపోయాడు. సుబోధుడు, వత్సలుడి గురుభక్తికి మెచ్చి తన గురుకులంలో చదివే పదిమంది శిష్యులను వాడికి అప్పచెప్పాడు. గురువును మెప్పించాలని వత్సలుడు వారికి ఎంతో శ్రద్ధగా చదువు చెప్పి, అచిరకాలంలోనే వాళ్ళను తనంతవారిని చేశాడు. మిగతా శిష్యులకు అంతత్వరగా చదువురానందువల్ల వాళ్ళు సుబోధుడి దగ్గిరకు వెళ్ళి, తమను కూడా వత్సలుడికి అప్పగించమని కోరారు.

దానికి సుబోధుడు నవ్వి, ''నాయనలారా! వత్సలుడికి విద్యాబోధన కొత్త. అందువల్ల, మీలో బాగా తెలివైన పదిమందిని ఏరి వాడికి అప్పగించాను. మీలో చురుకు పాలు తక్కువ కావడంవల్లనే చదువు త్వరగా రావడం లేదు తప్ప. వత్సలుడు నాకంటే గొప్ప గురువుకాదు. నావద్ద చదివినవారిలో, నాకంటే గొప్ప గురువు కమలుడొక్కడే. వాడిప్పుడు విద్యానగరం రాజాస్థానంలో వుంటున్నాడు,'' అన్నాడు.

ఈ విషయం వత్సలుడికి తెలిసింది. వాడెంతో బాధపడి సుబోధుడి వద్దకు వెళ్ళి, ''ఆచార్యవర్యా! గురువు శిష్యుడి గొప్పతనం చూసి గర్వపడాలే తప్ప అసూయ పడకూడదు. తమరెంతో గొప్పవారు. నా విద్య నాకు మీరు పెట్టిన భిక్ష. నేను మీకంటే శిష్యులకు బాగా పాఠాలు చెబుతూంటే, తమరు నన్ను మెచ్చుకుంటారనుకున్నాను తప్ప, ఇలా చిన్నబుచ్చుతారనుకోలేదు,'' అన్నాడు.

అందుకు సుబోధుడు, ''ఒకప్పుడు కమలుడి విషయంలోనూ ఇలాగే జరిగింది.

''వసుంధర''

అయితే కమలుడు నావద్దకు వచ్చి, నన్ను అసూయాపరుడని నిందించలేదు. తన లోని లోపం తెలియజెప్పి సవరించి, తనను నాఅంతటివాణ్ణి చేయమని కోరాడు. నీ గొప్పతనాన్ని నిర్ణయించవలసింది, నీ గురువైన నేనే తప్ప, నీవు కాదు. నేను అసూయాపరుడినని అనుకోవడం నీ అహంకారం. అహంకారంఅజ్ఞానులకేతప్ప జ్ఞానులకుండదు. జ్ఞాని తప్ప వేరెవ్వరూ మంచి గురువుకాలేడు,'' అన్నాడు.

వత్సలుడు సుబోధుడి కాళ్ళమీదపడి, ''ఆచార్యవర్యా! నా అజ్ఞానాన్ని మన్నించండి. ఇంకెన్నడూ ఇలాంటి పొరబాటు చేయను. అయితే, మీ శిష్యులలో నన్ను మించినవాడు లేడన్న పేరుతెచ్చుకోవాలని వున్నది. అందుకు నేనేం చేయాలో తమరే చెబితే, ఆ విధంగా నేను కృషి చేస్తాను,'' అన్నాడు.

సుబోధుడు వాణ్ణి లేవనెత్తి, ''క్షమించరాని అపరాధం నువ్వేమీ చెయ్యలేదు. రవ్వంత అహంకారం మినహాయిస్తే, నీలో అన్నీ మంచి గుణాలే! కృషిచేసి గొప్పవారనిపించుకోవాలన్న కోరిక ఉత్తములకే వుంటుంది. నా ప్రియ శిష్యుడు కమలుడిక్కూడా అలాంటికోరిక వుండేది. అప్పుడు నేను వాణ్ణి ముక్తపురంలోని ముగ్గురు వృత్తిపనివాళ్ళకు చదువు చెప్పి రమ్మన్నాను. వాడికందుకు ఆరునెలలు గడువిచ్చాను. ఆరునెలలూ వాడక్కడే వుండితీరాలని షరతుపెట్టాను. కమలు



డక్కడ ఆరునెలలూ వుండి, వాళ్ళకు చదువు నేర్పలేక తిరిగివచ్చాడు. నువ్వది చేయగలిగితే కమలుడి కంటే గొప్పవాడి వవుతావు,'' అన్నాడు.

ఇది వినగానే వత్సలుడికి చెప్పలేనంత ఉత్సాహం కలిగింది. వాడు గురువును వివరాలడిగి తెలుసుకుని వెంటనే ముక్త పురం ప్రయాణమయ్యాడు.

ముక్తపురంలో బర్బరు డనేవాడు క్షౌర వృత్తిని అవలంబించి బతుకుతున్నాడు. క్షౌరం చేయడంలోనూ, ఒళ్ళు పట్టడం లోనూ ఎవరైనా వాడి తర్వాతే! అందు వల్ల వాడికి క్షణం విశ్రాంతి వుండదు. ఆ వృత్తిలో వాడు బాగా డబ్బు సంపా దించి పెద్ద మేడ కూడా కట్టాడు. అయినా వాడు తన వృత్తి మానలేదు! అదే విధంగా వషరుడనే గుడ్డలుతికేవాడూ, వివరుడనే గుడ్డలు నేసేవాడూ, తమ తమ వృత్తు లలో తమకు తామే సాటి అనిపించు కుంటూ పెద్ద మేడలుకట్టి, తమ వృత్తులు కొనసాగిస్తున్నారు. విశేషమేమంటే— ముగ్గురు కూడా అక్షరంముక్కరాని నిరక్ష రాస్యులు.

వత్సలుడు ఈ ముగ్గురినీ కలుసుకో వాలనుకుని, ముందుగా బర్బరుడింటికి వెళ్ళి వాడి సంపదనూ, వాడి వైభవాన్నీ కళ్ళారాచూసి నివ్వెరపోయాడు.

బర్బరుడు, వత్సలుడు వచ్చిన పని విని, ''అయ్యా! నా వృత్తే నా చదువు. వేరే చదువుకునేందుకు నాకు తీరుబడి





ఇక ఆస్తి సంగతంటారా, అది శాశ్వతం కాదు. నా నిజమైన ఆస్తి నా వృత్తి! అదీ కాక, నేనుండగా ఇంకెవరో నా వృత్తిలో నాకంటే గొప్పవాడనిపించుకుంటే, నేను భరించగలనా? నా ఒంట్లో ఓపికున్నంత కాలం నేను నా వృత్తిని మానలేను,'' అన్నాడు.

వషరుడు, వివరుడు కూడా వత్సలుడికి ఇదేవిధంగా బదులిచ్చారు. వాళ్ళు చాలా మొండివాళ్ళనీ, తమ వృత్తిపట్ల ఎంతో గౌరవం కలవాళ్ళనీ గ్రహించినప్పటికీ, వత్సలుడు వాళ్ళను విడిచిపెట్టకుండా అనుక్షణం అంటిపెట్టుకుని వుండి, చదువు పట్ల వాళ్ళకు ఆకర్షణ పుట్టించడానికి ప్రయత్నిస్తూండేవాడు. ఈ విధంగా ఆరు మాసాలిట్టే గడిచిపోయాయి.

వత్సలుడు గురుకులానికి తిరిగి వెళ్ళి, తన ఓటమిని గురువువద్ద అంగీకరించాడు.

వత్సలుడు చెప్పినదంతా విని సుబోధుడు నవ్వి, ''ఆరోగ్యం కోసం మనిషి వ్యాయామం చేస్తాడు. కేవలం వేట మీదే ఆధారపడి బతికే క్రూరమృగాలు, తమ శరీరపటుత్వాన్ని కాపాడుకునేందుకు ప్రత్యేకంగా వ్యాయామం చేయవు. వాటి జీవన విధానంలోనే వ్యాయామం ఒక భాగమై వుంటుంది. అదే విధంగా, తాము చేపట్టిన వృత్తిలో గొప్ప ప్రావీణ్యం

కూడా లేదు. మీవంటి చదువుకున్నవాళ్ళు హరికథలో, పురాణాలో చెబితే వింటే, అదే నాకు జ్ఞానం. ఏ భాగవతులో నాటకాలో, నాట్యాలో చూపిస్తే, అదే నాకు వినోదం. ఇంక నాకు వేరే చదువెందుకు?'' అన్నాడు.

''విద్యలేనివాడు వింత పశువంటారు. అదీకాక నువ్వు తరతరాలకు సరిపడ్డ ఆస్తిని సంపాదించావు. ఇక ఈ వృత్తిని వదిలిపెట్టి, నావద్ద విద్యాభ్యాసం చెయ్యి. అచిరకాలంలోనే నిన్ను విద్వాంసుణ్ణి చేస్తాను,'' అన్నాడు వత్సలుడు.

దీనికి బర్బరుడు నవ్వి, ''చదువుకున్నా లేకపోయినా మనిషెప్పుడూ వింత పశువే!

సంపాదించినవాళ్ళకు చదువు అవసరం తెలియదు. ఈ ప్రపంచంలో ఎక్కువ మంది అభిలాషతో కాక, అవసరం కోసం మాత్రమే చదువుకుంటారు. బర్బరుడు, వషరుడు, వివరుడులకు లాగే నీకూ ఏదైనా వృత్తి విద్య తెలిసివుంటే, నీవు కూడా చదువు మీద ఆసక్తి చూపి వుండే వాడివి కాదు. అవసరం కోసమే నువ్వు చదువుకున్నావు. నీలాగా కాక అభిలాషతో విద్యాభ్యాసం చేసిన కమలు డెప్పటికీ కూడా, నీకంటే గొప్పవాడు!'' అన్నాడు.

''గురువర్యా! బర్బర, వషర, వివరులకు కమలుడు కూడా చదువు చెప్పలేక పోయాడు. ఈ విషయంలో కూడా తమరు నన్ను కమలుడితో పోల్చి, చిన్నబుచ్చుతా రెందుకు?'' అన్నాడు వత్సలుడు బాధగా.

''నువ్వు ముక్తపురంలో ఆరు మాసాలున్నావు. నేను చెప్పిన ముగ్గురికీ చదువు చెప్పిరావడం, నీ బాధ్యత. అది నీవల్ల కాదు. చదువుపట్ల అభిలాషగలవారు ఏం చేస్తారో నువ్వే చెప్పు?'' అని ప్రశ్నించాడు సుబోధుడు.

ఎంత ఆలోచించినా వత్సలుడికి సుబోధుడి ఆంతర్యం అర్థం కాలేదు. అప్పుడు సుబోధుడు గంభీరంగా, ''కమలుడేం చేశాడో తెలుసా? ఆ ఆరుమాసాల్లోనూ వాళ్ళ వద్ద, ఆ మూడు వృత్తివిద్యలూ క్షుణ్ణంగా అభ్యసించి వచ్చాడు,'' అన్నాడు.

వత్సలుడు తెల్లబోయి, ''కమలుడి వంటి మహా పండితుడికి, ఆ విద్య లెందుకు అక్కరకు వస్తాయి?'' అన్నాడు.

''అదే నీకూ వాడికీ తేడా! నువ్వు చదువుకోవాలంటే అవసరంగురించి ఆలోచిస్తావు. తనకు రాని ఏ విద్యనైనా నేర్చుకోవాలని కమలుడి అభిలాష! ఆరుమాసాలు ముక్తపురంలో వున్నందుకు సమయం వృధా కాకూడదని, వాడామూడు విద్యలూ అభ్యసించి వచ్చాడు,'' అన్నాడు సుబోధుడు.

ఆ తర్వాత ఏనాడూ వత్సలుడు తనను కమలుడితో పోల్చుకోలేదు. తన లోపం వాడికి అర్థమయింది.





# సుల్తానా వడ్డీవ్యాపారం

పర్షియాకు కొత్తగా సుల్తాను అయిన సయ్యద్ అబ్దుల్లాకు వినోద ప్రదర్శనలు అంటే చాలా ఇష్టం. ఈ ప్రదర్శనల కింద అతను మొదటి సంవత్సరం రెండు లక్షల దీనారాలు ఖర్చు చేసినట్టు లెక్క తేలింది. ఏటా సుల్తానుగారి వినోదాలకు గాను రెండేసి లక్షల దీనారాలు ఖర్చు అయితే మిగిలిన పరిపాలనకు డబ్బు చాలదు.

అందుచేత సుల్తానూ, వజీరూ కూర్చుని సమాలోచన జరిపి, ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమిటంటే, వడ్డీవ్యాపారాన్ని శాసనం ద్వారా ఆమోదించి, వడ్డీ వ్యాపారస్థుల మీద పన్ను విధించటం. ఇందువల్ల ఎవరికీ నష్టం ఉండదు. డబ్బు ఇబ్బందిలో ఉన్నవారికి అప్పు పుట్టుతుంది. వడ్డీల కిచ్చే వారికి వడ్డీ గిట్టుబాటు అవుతుంది. పన్నుల ద్వారా ఖజానాకు అదనపు రాబడి ఉంటుంది.

వెంటనే సుల్తాను వడ్డీవ్యాపారాన్ని అమలులోకి తెస్తూ శాసనం ప్రకటించి, తీసుకున్న అప్పు తీర్చని వారికి శిక్షలు కూడా నిర్ణయించాడు. ఈ శాసనం అమలులోకి రాగానే ధనికులు సంతోషించారు. వాళ్ళు చాలా హెచ్చు వడ్డీలకు అప్పులు ఇయ్యసాగారు. ఇదేమంటే, ''మేం గుమాస్తాల జీతాలు ఇయ్యాలి, సుల్తానుగారికి పన్ను కట్టాలి. వడ్డీ కింద మిగుల్చుకోవాలి,'' అన్నారు వాళ్ళు.

కొంతకాలం గడిచినాక సుల్తానాకు కొత్త శాసనం ఎలా అమలు జరుగుతున్నదో తెలుసుకోవాలనిపించింది. ఆమె తన దాసీని పిలిచి ఆ మాట అడిగింది.

''వడ్డీవ్యాపారానికేమమ్మా? బాగానే సాగుతున్నది. ధనికులు పేదల రక్తాన్ని పీల్చేస్తున్నారు. విధిలేక అప్పులు చేసిన వారు. అప్పులు తీర్చలేక జైళ్ళకు పోతు

పర్షియా జానపద కథ

న్నారు. నగరంలో అశాంతి హెచ్చింది అన్నది దాసి.

ఈ మాట విని సుల్తానా కంపించి పోయింది. వడ్డీవ్యాపారం ప్రజోపయోగ మయినదనీ, దానివల్ల అటు ప్రజలకూ, ఇటు ప్రభుత్వానికీ లాభం ఉంటుందనీ సుల్తానుతో బాటు ఆమె కూడా నమ్మింది. కాని తీరా చూస్తే వడ్డీవ్యాపారం చాలా భయంకరమైనదిగా కనబడింది.

ఆమె సుల్తానుతో ఈ మాట అంటే సుల్తాను ఒప్పుకోలేదు. ''వడ్డీవ్యాపారస్థులు అడిగే వడ్డీకి ఇష్టపడినవారే అప్పు చెయ్యాలి. అప్పు తీసుకుని చెల్లించక పోవటం చట్టాన్ని ధిక్కరించడమవు తుంది,'' అన్నాడు సుల్తాను.

''అలా అయితే, నేను కూడా వడ్డీ వ్యాపారం చేస్తాను. వెయ్యి దీనారాలు ఇప్పించండి. నేను కూడా అందరిలాగే పన్ను చెల్లిస్తాను. అది మీ ఖర్చులకు పనికి వస్తుంది,'' అన్నది సుల్తానా.

సుల్తాను ఇందుకు సంతోషంగా అంగీకరించాడు.

సుల్తానా వడ్డీ వ్యాపారం చేస్తున్నట్టు దివాణంలో అందరికీ తెలిసిపోయింది. ఒక రాజభవన రక్షకుడు అవసరం వచ్చి సుల్తానా వద్ద నూరు దీనారాలు అప్పు తీసుకుని, యాభై దీనారాలు వడ్డీ కింద



ఇయ్యటానికి ఒప్పుకున్నాడు. అలాగే మరొక దళాధిపతి, ఆమె వద్ద రెండు వందల దీనారాలు అప్పు తీసుకుని, యాభై దీనారాలు వడ్డీ కింద ఇయ్యటానికి ఒప్పుకున్నాడు. చివరకు వజీరు కూడా సుల్తానా వద్ద అయిదు వందల దీనారాలు అప్పుచేసి, నూరు దీనారాలు వడ్డీ కింద ఇస్తానన్నాడు.

కొంతకాలం గడిచింది. ఒక రోజు సుల్తాను నగర సంచారానికి ఒంటరిగా బయలుదేరి, నగరమంతా తిరిగి, ఊరి చివరకు వెళ్ళేసరికి అతనికి ఆకలి అమితంగా పుట్టుకొచ్చింది. సమీపంలో అతనికి ఒక పేదవాడి ఇల్లు కనిపించింది.



సుల్తాను గుర్రం దిగి ఆ పేదవాడి ఇంటి తలుపు తట్టాడు.

పేదవాడు తలుపు తెరిచి, సుల్తానును చూసి నివ్వెరపోయి, వంగి వంగి సలాములు చేస్తూ సుల్తానును లోనికి ఆహ్వానించాడు.

"ఆకలిగా ఉన్నది. భోజనం కావాలి," అన్నాడు సుల్తాను.

"తమరు కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. నేను భోజనం ఏర్పాటు చేస్తాను," అని ఆ పేదవాడు, సమీపంలో ఉన్న ఒక ధనికుడి వద్దకు పరుగెత్తి పోయి, యాభై దీనారాలు అప్పు పుచ్చుకుని, ఆ డబ్బుతో, అమిత ఖరీదైన ఆహార పదార్థాలు కొని, ఇంటికి తిరిగి వచ్చాడు. అతని భార్య త్వరలోనే రాజోచితమైన విందు భోజనం తయారుచేసి, సుల్తానుకు వడ్డించింది.

ఆ భోజనం తింటూ సుల్తాను ఆశ్చర్యపోయాడు. అది తాను రోజూ తినే భోజనానికి ఏమీ తీసిపోదు. ఆ పేదవాడు తనకు అలాంటి భోజనం ఏర్పాటు చెయ్యటానికి అప్పు చేసి ఉంటాడని కూడా సుల్తాను గ్రహించాడు.

అందుచేత అతను రాజభవనానికి తిరిగి వస్తూనే వెయ్యి దీనారాలు వజీరుకు ఇచ్చి, "వీటిని ఫలాని చోట, ఫలాని పేదవాడికి అందజెయ్యి," అని చెప్పాడు.

ఈ సంగతి తెలియగానే సుల్తానా వజీరును తన వద్దకు పిలిపించి, తన బాకీ ఆరువందలూ వెంటనే చెల్లించమన్నది. చేసేదిలేక వజీరు తన చేతిలో ఉన్న వెయ్యి దీనారాల నుంచి ఆరువందలు తీసి ఆమె కిచ్చాడు.

తరవాత ఆయన దళాధికారిని పిలిచి, "ఈ నాలుగు వందల దీనారాలనూ ఫలాని చోట, ఫలాని వాడికి చేరేటట్టు చూడు," అన్నాడు.

ఆ డబ్బు దళాధికారి చేతికి రాగానే సుల్తానా అతన్ని పిలిపించి, తనకు అతను బాకీ ఉన్న రెండు వందల యాభై

దీనారాలూ ఆ క్షణంలో చెల్లించమన్నది. విధి లేక అతను ఆమెకు రెండు వందల యాభై దీనారాలూ ఇచ్చి, మిగిలిన నూట యాభై దీనారాలనూ రాజభవన రక్షకుడికి ఇచ్చి, వాటిని ఫలాని చోట, ఫలాని వాడికి ఇచ్చి రమ్మన్నాడు.

అయితే సుల్తానా వాణ్ణి కూడా పిలిచి, తనకు రావలసిన నూటయాభై దీనారాలు చెల్లించమన్నది. వాడు తన చేతిలో ఉన్న డబ్బు యావత్తూ ఆమెకు ఇచ్చేశాడు.

మరికొంత కాలం గడిచింది. ఒక రోజున ఒక ధనవంతుడు ఒక పేదవాణ్ణి దర్బారుకు తీసుకు వచ్చి, ఆ పేదవాడు తన బాకీ తీర్చలేదని ఫిర్యాదు చేశాడు.

సుల్తాను పేదవాణ్ణి, "అప్పు దేనికి చేశావు?" అని అడిగాడు.

"ఒక రోజు తమరు మా ఇంట అతిథ్యం స్వీకరించారు. మీ అతిథ్యం కొరకు ఈ ధనవంతుడి వద్ద అప్పు చేసి, దాన్ని తీర్చలేకుండా ఉన్నాను," అన్నాడు పేదవాడు.

"ఆనాడే నీకు వెయ్యి దీనారాలు బహుమానంగా పంపాను. దాన్ని ఏం చేశావు?" అని సుల్తాను అతన్ని అడిగాడు.

పేదవాడు ఆశ్చర్యపడుతూ, "నాకు ఒక్క దీనారం కూడా అందలేదు, హుజూర్!" అన్నాడు.



వెంటనే వజీరు లేచి, అందులో ఆరు వందలు తాను అవసరంగా సుల్తానాగారి బాకీ తీర్చటానికి వినియోగించవలసి వచ్చిందనీ, మిగిలిన నాలుగు వందలూ ఫలానావాడికి ఇవ్వమని దళాధికారికి ఇచ్చాననీ చెప్పాడు.

దళాధీకారీ, రక్షకుడూ కూడా తమ చేతిలోని డబ్బు ఉన్నపాళంగా సుల్తానా గారి బాకీ తీర్చటానికి ఇచ్చెయ్యవలసి వచ్చిందని చెప్పుకున్నారు.

"మీరు ముగ్గురూ నేరస్థులు. తీర్చ లేని అప్పులు చెయ్యటం ఒక నేరం. ప్రభుత్వం సొమ్ము వాడుకోవటం మరో నేరం. మీ ముగ్గురికీ రెండేసి సంవత్స

రాలు జైలుశిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు సుల్తాను.

తరవాత ఆయన పేదవాడి కేసి తిరిగి, "కటిక దరిద్రుడివై ఉండి అప్పు చెయ్యటంలో నీ ఉద్దేశం ఏమిటి? నేను నిన్ను విందు చెయ్యమని అడిగానా? తీర్చలేని అప్పు చేసినందుకు నీకు ఒక సంవత్సరం జైలుశిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు.

అయినా సుల్తాను మనసంతా అస్త వ్యస్తంగా ఉన్నది. ఆ రాత్రి అతను సుల్తానాతో, ''ఇక నీ వడ్డీ వ్యాపారం ఆపెయ్యి,'' అన్నాడు.

''అదేమిటి? నా వ్యాపారం వల్ల నష్ట మేమిటి?'' అన్నది సుల్తానా.

''నీ వ్యాపారం మూలంగా ఇవాళ నలుగురిని జైలుకు పంపాను. నీ వల్ల అదా అయే నూరు దీనారాలూ, రెండు సంవత్సరాలపాటూ వాళ్ళ తిండికి సరి పోతాయా, చూడు!'' అన్నాడు సుల్తాను.

వెంటనే సుల్తానా కలమూ, కాగితమూ తీసుకొని లెక్కలు కట్టి, ''సంవత్సరానికి ఆ నలుగురికీ ఎనిమిది వందల దీనారాలు ఖర్చు అవుతాయి. రెండు సంవత్సరాలకూ పదహారు వందలు!'' అన్నది.

''చూడు, నీ వడ్డీ వ్యాపారం వల్ల ఖజానాకు ఎంత నష్టమో!'' అన్నాడు సుల్తాను.

''అయితే మీరు అమలు చేసిన వడ్డీ వ్యాపారం మీద ఆదాయం ఎంత?'' అని సుల్తానా అడిగింది.

''రెండు లక్షలు!'' అన్నాడు సుల్తాను.

''ఇప్పటికి అప్పు చెల్లించని వాళ్ళు ఖైదులో ఎందరున్నారు?'' అని సుల్తానా అడిగింది.

''సుమారు ఇరవై వేల మంది'' అన్నాడు సుల్తాను.

సుల్తానా లెక్క కట్టి గుండె బాదు కుంటూ, ''వాళ్ళ కింద ఖర్చు పది లక్షలు!'' అన్నది.

మర్నాడే నగరంలో వడ్డీ వ్యాపార శాసనం రద్దయింది.





సహారా ఎడారిలోని టస్సిలీ ప్రాంతం ఒకప్పుడు సారవంతమైన భూమిగా వుండేది. అక్కడ ప్రజలు నివసించేవారు. అది క్రీ.పూ. 2000 సంవత్సరాల నాటికి క్రమంగా ఎడారిగా మారిపోయింది!

## ఎడారి!

## 'బీవర్' తోక!



భూమిమీదా, నీళ్ళలోనూ నివసించే 'బీవర్' జంతువుకు చదునైన వెడల్పాటి తోక వుంటుంది. ఇది నీళ్ళలో ఈదేప్పుడు చుక్కాని లాగా ఉపయోగపడుతుంది. ఈ తోకను నీళ్ళపై కొట్టినప్పుడు ఆ శబ్దం కొన్ని మైళ్ళదూరం వినిపిస్తుంది. అలా అది ఒక హెచ్చరికగా కూడా పనిచేస్తుంది.



## బరువైన కీటకం!

భూమధ్యరేఖ ప్రాంత ఆఫ్రికాలో కనిపించే ఒకరకం పెద్ద కుమ్మరి పురుగే (గోలియత్ బీటిల్) కీటకాలన్నిటిలోకీ చాలా బరువైనది. పెద్దదైన మగపురుగు 100 గ్రాములు బరువూ, 110 మి.మీ. పొడవూ వుంటుంది.




**1975**
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన
ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

# వనిత

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక
అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది

# వనిత

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

# వనిత

**1990**
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదహారవ
సంవత్సరం....




కారణం

• విజ్ఞానానికి • వికాసానికి • వినోదానికి

# వనిత

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



Brahm Dev

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అభ్యాసంతో సాధ్యం! రెండవ ఫోటో: బాలభారత వికాసం!

పంపినవారు: టి. ప్రభాకరరావు, పార్నపల్లి, కడపజిల్లా—516 396.

బహుమతి మొత్తం రు. 50/-. నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి !

సంవత్సర చందా :

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా : రూ. 81.00  ఎయిర్‌మెయిల్ ద్వారా : రూ. 156.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా : రూ. 87.00  ఎయిర్ మెయిల్ ద్వారా : 156.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి :

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026